# ఈ నాటకము నందలి పాత్రధారులు



## పురుషులు

౧ సూత్రధారి
౨ ఉదయసేనుడు
౩ వైశ్యుడు
౪ క్రూరసేనుడు
౫ వీరపాలుడు
౬ కింకరులు
౭ కనకసేనుడు
౮ దొంగవాడు
౯ అచ్చిగాడు
౧౦ బుచ్చిగాడు
౧౧ జయసింహుడు
౧౨ ప్రధాని
౧౩ యోగి
౧౪ భటుడు
౧౫ సేవకుడు
౧౬ రాంశెట్టి
౧౭ సుకీర్తి
౧౮ దేవదత్తుడు
౧౯ వకీలు
౨౦ మేఘవాహనుడు
౨౧ పూజారి

---

## స్త్రీలు

౧ నటి
౨ విమలాదేవి
౩ చెలియ
౪ తార
౫ సత్యబాయి
౬ పద్మాబాయి
౭ పోళి

ఓం

శ్రీమతే రామానుజాయనమః

# కనకతార

నాటకము



గ్రంథకర్త

బూర్గుపల్లి వేంకటనర్సయాఖ్యుఁడు

పబ్లిషర్

## కొండా శంకరయ్య,

పుస్తకముల వ్యాపారము,

సికింద్రాబాద

ప్రీమియర్ ముద్రణాలయమున ముద్రించి

ప్రచురింపబడెను

సికింద్రాబాద్.

1950

# ప్రకటన

నాచే రచియింపబడిన ఈ కనకతార నాటకముయొక్క సర్వాధికారములు మ॥ రా॥ శ్రీ కొండా శంకరయ్య పుస్తకముల వ్యాపారము మహాకాళివీధి సికిందాబాద గారికి యిచ్చియున్నాడను.

ఇట్లు
బూర్గుపల్లి
వేంకట నర్సయాఖ్యుడు

---

# హెచ్చరిక

ఈ కనకతార నాటకముయొక్క సర్వాధికారములు మాకే చెంది యున్నవి కావున మాయనుమతి లేక నితరు లెవ్వరు యెంతమాత్రము అచ్చు వేయకూడదు. అట్లు మాయాజ్ఞనుల్లంఘించి అచ్చు వేసినయెడల మేముచేయబోవు సివిల్ క్రిమినల్ చర్యలకు బాధ్యులవుదురని యిందు మూలముగా తెలియ పరచుచున్నాము.

ఇట్లు
కాపీరైటుహక్కుదార్లు
కొండా శంకరయ్య
పుస్తకములవ్యాపారము
మహాకాళివీధి
సికింద్రాబాదు.

# KANAKATHARA NATAKAM

శ్రీమతే రామానుజాయనమః

# కనకతార నాటకము



కం॥ శ్రీకాంతా మణివల్లభ ♦ లోకేశ బిడౌజ వంద్య రుక్మాంబరసు
శ్లోకచరిత్రాంబుజముఖ ♦ శ్రీకరమగు చోలమద్ది శ్రీజగధీశా॥
కం॥ శ్రీయచ్యుతశఠగోపమ♦ నీయతిరాజాంఘ్రియుగము లెంచియుభక్తిన్
పాయకవరవరమునులను♦ నాయుల్లమునందు నెంతు నతిమోదమునన్॥
కం॥ భారద్వాజకులాంబుధి♦ తారాధిపులయ్యి వెలయు ధన్యాత్ములుమా
శ్రీరామానుజ గురుపద ♦ నీరజముల నెంతుభక్తి నిరతముమదిలో॥
కం॥ వరశ్రీ పరవస్త్వాన్వయ ♦ శరనిధి విధులయ్యి క్షోణి జన్మించినమా
వరశ్రీనివాస దేశిక ♦ చరణాంబుజ ములదలంతు సంతోషమునన్॥
కం॥ జననీ జనకులభక్తిన్ ♦ కొనియాడియు పతివ్రతలను కూరిమితోడన్
ఘనులగు భాగవతోత్తము ♦ లనుసన్నుతి జేతునన్ను రక్షించుటకై॥

అనుబంధము

రారగోపబాలా - శీలా - రాధికాప్రియా - మారకోటి సుంద రాంగ - మంజుభాష ఖగతురంగ - క్రూరదైత్య మదవిభంగ - రాధికా ప్రియా ॥ రారా॥౧॥ మాధవాచ్యుత గోవిందా - మారజానక పర మానందా - శ్రీధరాబ్ధ కేశార్చిత రాధికాప్రియా - శీరా॥ రారా ॥౨॥ సనకసనందనాదీ - మునివంద్యా కందభేదీ - కనకపీతాంబరధారి - రాధికాప్రియా - శీలా ॥ రారా॥౩॥ ధరణిచోలమద్దినగరీ - ధామశ్రీ మురళీధారీ - కరుణసాగర నగధారీ రాధికాప్రియా - శీలా॥ రారా॥

(సూత్రధారి ప్రవేశించి సభవంకజూచి)

సూ వ॥ యేమీ సర్వజనంబులిట్టి సభ నలంకరించి యున్నారేమి కారణంబు కాబోలు పూర్వులకథ లాలకించుటకయ్యేకదా మంచిది వీరి కర్ణానందంబగునట్లు నొక పుణ్యకథ వినిపించ మత్కాంతామణియగు నటిని యిందురావించి విచారించెదా. (తెరవంకజూచి) కాంతామణీనటీ నీవొకసారి యిటురమ్మా.

నటి-వ॥ నాథా త్వరగా నన్నురమ్మని పిలచిన కారణమేమి.

సూ-వ॥ మనోహరీ యీసభాసదుల మనోల్లాసంబుగ నొక పుణ్య కథ వినంజేయుటకై నిన్ను యిందు రావించితి.

నటి-వ॥ మనోహరా తాము సకలశాస్త్ర సంపన్నులై యుండియు యేమియెరుంగని యజ్ఞానురాలనై యున్న నన్నేల విచారింపుచుంటిరి మీరే యోచించి యొక సత్కథను విన జేయుడు.

సూ-గీ॥ కమలముఖి యిటువినగదే కనకతార ♦ చరితమును చిత్రమై యుండు మరియునిదియు - వినగ జేయదలంచియు వేడుకలర ♦ నినుపిలిపింప పిలచితి నిక్కముగను॥

సూ-వ॥ కావున కాంతామణీ యీకనకతార నాటకమును విని పింప వలయునని నాయభిప్రాయము నీయిష్టంబెద్దియో తెల్పుము.

నటీ-గీ॥ భళిభళీ యిట్టిచరితంబు ప్రజలువిన్న ♦ నెంతయో సంతసింతురు స్వాంతమందు ♦ గానమీరిట్టి కథయొబల్ కడుముదమున ♦ వినగ జేయుడునాథ సవిస్తరముగ॥

వ॥ అహా నాథా యిట్టి కనకతార కథయే వినంజేయుడుగాని యిట్టి నాటకము నూతనముగా కృతిజేయించిన వారలెవ్వరు నాకుం దెలుపుము కర్ణానందముగా వినియెద.

సూ-సీ॥ శ్రీరమ్యమైన జాగీరు పెదమెటిపల్లి । తాలూకలోనబల్ మేలిమైన । వరచౌలమద్ది నివాసులైయున్న । కోత్వాలి వతందార్లు ధైర్యమతులు । వరబాసవంశ సంభవులు రాజేశ్వర । రావుఘోరవారు సల్లలితమతులు । వీరికి పుత్రులై వెలయుమాధవరావు । మరిగంగరావు ధర్మాత్ములంద్రడు । పరమతులవంశ సంభవులునుమాలి । కిద్మతిగలవారు సద్ధర్మపరులు । రామారావు ఘనుండు లక్ష్మణరావునా । రాయణరావు రశికులవని । జగతికీర్తికినాపేక్ష జెందియిట్టి । కనకతార చరిత్రంబు కడు ముదమున । శాల్మలీపురి వాకవీశ్వరుని బిలిచి రచనజేయించి రిలమెచ్చ రమణివినుమా॥

సూ-సీ॥ వరచౌలన ద్దిసద్వైశ్య రత్నములగు। పడిగెలవంశ సంభవులనంగ పెండ్లికుల గోత్రజుల్ పేరువరుసయ్యనా। రాయణయునుగర్ల రాముడరియు । హనుమాండ్లు కిష్టయ్య యగుసావుకార్లుపే । రైనవారు త్తములై రశికులవని । యొకనాడు మనమున నూహించికీర్తియే। శాశ్వతమనియెంచి సలలితముగ । నెలిమికీర్తికపేక్షించి యిట్టికనక । తారనాటక

మును కొంత ద్రవ్యమొసగి । కృతియు జేయించి రిలమెచ్చు కూరిమినను।
వీరినందరి నేలు సర్వేశ్వరుండు॥

నటీ-వ॥ ఆహా మనోహరా వీరినందరి నెల్లకాలము లక్ష్మీవిభుండె రక్షించుచుండును గాని యిక నాకేమాజ్ఞ యొసంగువారలు.

సూ-వ॥ సుందరీ యీ పూదోటలో హాయిగా విహరింపుచు కొంత ప్రొద్దుబుచ్చ వలయునని నాకోరిక వింటివా

న-వ॥ జీవితేశ్వరా నీవనువిధ జా యీ విరితోటలందు విహరింప వలయునని నామనమ్ముగూడా గోరుచున్నది రాగండు.

(అని నిష్క్రమింతురు పర్దా్రవాలును)

— ( ఉదయసేనుడు ప్రవేశం )—

అనుబంధము

దర్వు॥ ఉదయసేన మహీపాలుడట్ । మృదు హృదయుడ సద్గుణ శీలుడట్ ముదమున రాజ్యంబును పాలించెడు । త్రిదశపతిని మీరినవిభ వముగలా ॥ఉ॥౧॥ సకలశాస్త్ర సంపన్నుడట్ । మహా యకళంకుడ బుధ మాన్యుడట్ । సుకరముగను దీనజనాళిని యానసవరించిన నయ విధేయు డట్ ॥ఉ॥౨॥ నగరాడ్ సత్సమ స్థైర్యుడట్ । మహాయగణిత భగవత్ కార్యుడట్ । జగతియందుగల నాలమద్రిశ్రీ । నగధరునిపద కంజముల నుతించెడి ॥ఉ॥౩॥

వ॥ ధీవిశారదా.

ధీవి-వ॥ ఉదయసేన మహీపాలా యేమియాజ్ఞ.

వాదం - దర్వు

వ్రుద॥ క్షేమమేకదా-మనరాజ్యంబునగల భూమిసురాదిగ పుర జనులందరు ॥క్షే॥ యేమికొరంతలు గలుగక నుండియు - సామజవరదుని సన్నుతిజేయుచు ॥క్షే॥

వ॥ ధీవిశారదా నేబల్కు-నట్లు మనరాజ్యంబున సకల జనంబులు యేమికొరంతయులేక సుఖోపాయులై యున్నవారలేకదా.

ధీ॥ భూమీశ్వర మీకేమని తెల్పుదూ - తామ వినగలేదా యిటాకను ॥ భూ॥ తామసమగు మీతమ్ముని చేష్టలు - భూమిశీటుల గలవే మర్యాదలు ॥ భూ॥ ౨॥

వ॥ అయ్యా మనరాజ్యంబున సకలజనంబుల కెట్టి కష్టంబులంటక

మహా సౌఖ్యంబుగానే యున్నవారుగాని సీతమ్మయ్యగారగుక్రూరసేనుల వారి దుర్మార్గతనములచే లోకులు చాల భీతిగొని యున్నవారు వారు జేయుపను లిట్టిటివని చెప్ప నోరాడదు అదంతయును మీకు నెలవే యుండునుగదా.

పుద॥ యిందులకై నేనేమియు సేయుదు . - నెందునగనలే దిట్టి దురాత్ముని ॥యిం॥ మందగుణముచే మనుజుల నందరి - తొందర జేయును దుర్నీతుండై ॥యి॥ 3॥

ఉ॥ తక్కువలేదు ధారుణి ♦ రథంబులు నాగము లశ్వ సంతతుల్
మక్కువ సర్వభోగములు ♦ మాకొనగూర్చె విధాతగానినే
నెక్కువ గుండగావలసె ♦ నీవిధిక్రూర కృతాజ్ఞ చేష్టల్
దక్కగ నేమిజేత మిపుడా ♦ రయదెల్పు మమాత్యపుంగవా॥

వ॥ కావున యిందులకై నామది రాత్రింబవలు తపించుచున్నది. యిట్టి నామనోవ్యథ యెన్నడు దీరునోకదా.

ధీవి॥ సాకల్యంబుగ చాలమద్దిహరి - యేకరణియు దరిజేర్చునో మనలన్ ॥సా॥ యీకరణియు మీరేలచింతగొన - బోకుడు ధైర్యంబును గొనియుండుడు ॥ర॥

వ॥ నరేంద్రా నాకుగూడ చింతగానున్నది యెన్నోవిధంబుల క్రూరసేనునకు విహితంబులు దెలుపుచు నిట్టి దుండగములు మానుమనిన నేనేవారికి విరోధిగా గనుపడు చున్నాడగదా.

(యింతలో క్రూరసేనుడు వచ్చి మరుగున దాగియుండి వీరల వాక్యంబులు వినుచు తనలో)

క్రూ-వ॥ యేమీ వీరిరువు రేదియో విచారించుచున్నవారు యీ స్తంభము మరుగుననుండి వినియెదగాక.

పుద-వ॥ ధీవిశారదా నీవా క్రూరసేనునకు విరోధియైనదటులుండ నిమ్ము దుష్టులకడకు జనులేగి బోధజేయుట నిష్ప్రయోజనమేకాని లాభం బులేదు యవివేకి నీతులు విననేవినడు యెకవేళ్ళ వినినయెడలయదియు నపుడేకాని నది యెప్పటికి నిలుచునా.

పుద-గీ॥ నీచగుణములు వినుమన్న తోచదతని ♦ కెంతజెప్పిన వినడు
నికేమిసేతు ♦ పైత్యములుగల్గు రోగికి బడునెతీపి ♦ దానికామం
దు బంధన్గా తగనారసర్తు॥

వ॥ కాబట్టి యీకహ్లారుడొనర్చు దుండగమువల్ల మన ప్రజల కెందరెందరికో పలువిధములగు కష్టములు గలుగుచుండెనుగదా యిందు లకా కహ్లారుని బంధించి చెరసాల నుంచుటే కర్తవ్యముగదా.

(యీమాట కహ్లారసేనుడు విని)

కహ్లా-వ॥ యేమీ నన్ను బంధించి చెరసాలయందుంచెదవా నీవె న్నటికైన నన్నేమి సేయజాలవు నీవు భ్రాతవగుటచే నింతవరకు కరుణిం చితిగాని యిక కరుణించక నీప్రాణంబులు దియ్యక మానను నమ్ముము.

ధీవి-వ॥ రాజేంద్రా మనము జేయునదేమున్నది మీరనువిధంబె జేయుట కర్తవ్యము యింతకు మించిన వుపాయము యేమియులేదుగదా.

కహ్లా-వ॥ వోరే ద్విపాద పశువులారా మీరేనానన్నిట్లుజేయునది యిటులెన్నిదినంబులనుండి ప్రేలుచున్నవారలు యేలనో పాపంబని మిమ్ముక్షమన్నించితిని యిక మీ జిహ్వలు దీయుదునేకాని యికనూరకుం నువాడనుగాను యెన్నటికైనను మీప్రక్కలోపాముననే తలంచుకొనుడు.

(అంతలో లుబ్ధుండను కోమటివచ్చి రాజుకెగని అనుబంధము)

దరువు॥ కాళీజాలమయ్యమేము ధారుణీశ్వరా ॥తా॥ తాళీజాల మయ్యామీ తమ్ముడు జేయంగ నెంతో - హేళనంబులాయెనింక నెంత కని యోర్వగలము ॥తా॥

కహ్లా-వ॥ అవురా యిందులకీలుబ్ధుండు మొరబెట్టుచు వచ్చియున్న వాడుమంచిది రానిమ్మయీపశువులేమి తీర్మానము జేతురో వినియెదగాక

లుబ్ధు-వ॥ ధోరో మీతమ్ములుంగారు జేయంగ యికమేము బ్రతుక లేము మాక్షేమలేమని తెలుపుదు స్వామీ.

వుద-వ॥ లుబ్ధ మహాశయా నీవెన్నడులేనిది నేడేమి విలపింపుచు వచ్చియున్నాడవు మాతమ్మునివలన నీకేమి కష్టమువచ్చి యున్నదో తెలుపుము భయంబు నొందకుము.

లు-వ॥ తెలుపగ నోరాడదేమి తెలుపుదునయ్యో ॥తె॥ అలువ బుద్ధి యగుమీతమ్మయ్యయూ మాయిల్లుజొచ్చి- తలుపులూడదన్నిమహా తగనికార్యమును జేసెను ॥ ॥

వ॥ రాజేంద్రా నేటి ప్రాతఃకాలమున కహ్లారసేనుండు వీర శూరులగలసి మాగృహంబునకొచ్చి అయ్యయొయ్యో (అనిబొబ్బవేయుచు) యేమని చెప్పవలయును చెప్పుటకు నోరాడకున్నదిగదా (అనియేడ్చును)

వృద-వ॥ దుఃఖించకుము దుఃఖించకుము అది యెట్టి కన్యారకార్య మొనర్చెనో భయంబు జెందక సర్వంబును దెల్పుము.

లు ద॥ ఖండితముగ మేమోర్చి - యుండలేమయ్యా॥ దండి ప్రభువు నీవటిబహు దయగలవాడవని - యుండితి మిందాకనికన్ - రెండోరాజ్యము బోదుము ॥ఖండి॥

వ॥ అయ్యా అట్లవారు గలసివచ్చి మేమత్యంత గారావముగా పెంచుచున్న పదునార్గేండ్ల ముద్దుకూతురిన్బట్టి మానభంగ మొనర్చ దలంచిన నదికూకలిడగా బంధువుల యుతము మేమందరము యేకమై వచ్చి రక్షింపుడని మొరబెట్టిన విడువలేదుగదా యెట్టకేల కెట్టులనో విడి పించితిమి (వృదయసేనుడు తనలో)

వ॥ ఆహా శ్రీహరీ యింతఘోరకృత్యంబు జరిగెనా యిక నాకన్యా రుని ముఖంబు జూడవచ్చునా మిక్కిలి దురాత్ముడయ్యె దినదినముదుండ గము లెక్కువగానే జేయుచుండెనుగదా ధీవిశారదా వింటివా యుద్ధురా త్మునేమి జేయవలయును.

ధీవి వ॥ అట్టిపాపిని యెట్ల శిక్షించిన దోషంబులేదుగారాజన్.

కన్యా-వ॥ వోరీ నీవేమి చేయగలవు నేటిదినమున నిన్నీమదీయ కరవాలంబున నీశిరంబు ఖండింపకున్న నేకన్యారసేనుండనే కాసు చూడు చూతుము.

లు-ద॥ ధారుణిశ్రీ చాలమద్ది ధాముడయ్యెనా - శ్రీరమణీశుండు యిట్టి - కన్యారమానసులకె జయము - నారూఢిగ జేయుచుండె నదియెం తటి పాపమోయీ ॥ధారు॥

వ॥ ఘోరో యింక నిటువినుడు అల్ల మేమందరముంగూడినాకూతు రును విడిపించిన పిమ్మట నాలమందు బెబ్బులి కైవడి యొక దండంబు చేబూని మమ్మలందరిన్ మోదించిన అందులో మాభావగాధి కాలు విరిగినది మాతాతగారి నాశికంబు పగిలినది కొందరు మూర్ఛిల్లి పడి పోయిరి కొందరి చేతులు విరిగినవి కన్నులుబోయినవి యిటు లనే కులకు గాయములై మిక్కిలి యవస్థపాలైరిగదా.

వృ-వ॥ సరే కాని యిట్టిదురాత్మునిని నీయింటిలోనికెట్లుకానిచ్చితివి.

లు-వ॥ అయ్యా మేమప్పుడు యింటిలోలేము ప్రక్కయింటిలో కూర్చొనియుచ్చారము యొక నాకుమార్తెమాత్రమే సిరోజములు దువ్వ

కొనుచు కూర్చొనియుండెను. అట్టిసమయంబున వచ్చి యింతపని జేసిరి యిక యేమిసేయవలయును. మమ్మురక్షించిన శిక్షించిన మీాదేభారము గదా దొరో.

వు-వ॥ అకటా యిట్టిక్రూరాత్ముని దుష్కృత్యములవల్ల నాప్రజల కెట్టి కష్టంబులు గలుగుచున్నవి. ఆహా దైవమా యిందుకు నేనేమి చేయ గలను. (ప్రకాశముగా) లుబ్ధా యిక నా క్రూరుని నీయింటికి రాకుండ జేసెదగాని యికనీవు నిశ్చింతగా యింటిలో నుండుము.

లు-వ॥ ఘోరో రొట్లుజేసిన మీాచిత్తము మాకుంమీారుందప్ప యెవరు రక్షింతురు యికో నేబోవుచున్నవాడ.

(అని వెళ్ళిన ధీవిశారదునితో) డైలాగ్

వు-దర్వు॥ యేమిసేయుదమూ ధీవిశారదాయికా ॥యే॥ కామ క్రోధుడు గర్వాంధుడుమన- గ్రామస్తుల కలక పడజేసెనూ ॥యే॥౧॥

సీ॥ పుణ్యాంగనల్గూడ పుణ్యంబటంచును ♦ వెంటాడు నెవ్వడు విసుగులేక ♦ స్త్రీశిశుహత్యలం జేయుచు వెరువక ♦ పశు బ్రాహ్మణుల నైన పట్టిచంపు ♦ బీదల ధనమన్న వెరువడెంతేనియు ♦ హరియింప పాపంబటన్న వినడు ♦ మాంసంబులనుమెక్కి మధువును గ్రోలుచు ♦ వల దన్నవారల బట్టిపొడచు॥ యిట్టియాగడమెల్ల నెన్నాండ్లుజాతు ♦ నేమి సేయుదుదైవమా యెరుగరాదు ♦ కాలమెల్లను విపరీత కాలమాయె ♦ నేమిజెప్పుదు నింక నేనెట్లనోర్తు॥

వ॥ కావున ధీవిశారదా యిందులకై నాకెటుదోచక యున్నది ప్రజల క్షోభంబులు జూచుచు నేనెట్ల భరింతును.

ధీ-దర్వు॥ మానవేంద్రా నామదికెటు దోచదికా ॥మా॥ కాము న్నదియిల కాకతీరునే - నైనచింతగొన నగునేఫలంబును॥మా॥ ౨॥

వ॥ మానవేంద్రా దుష్టకథల చెరించువారికి పాపభయంబు లెక్క డివి దయారసంబు లెక్కడివి నిండ మునిగినవానికి చలియు లేగన్నట్లు నీతమ్ముడైన క్రూరసేనుడు నీకుంగాక వనజాసనుకైన వినునా దుర్మా ర్గుల సన్మార్గుల జేయుట నెవ్వరితరము రాజా.

(క్రూరసేనుడు క్రోధముచే)

మ॥ అనుడీమిమ్ముల నిప్పుడేమనను నే ♦ మన్నన్ దగున్ నింకనే
వినిపింపన్ బనియేమి ముందుగనుడీ ♦ వీరత్వ మేమయ్యెనే

మనినన్ లెక్కరెయ లేదుగా వలయుగా ♦ నంజూతు మున్ముందున
న్ననికన్ జూతురుగాక బ్రేలుడిక ♦ మిమ్మంతంబు నొందించెదన్॥

వ॥ వదురుపోతులారా మీకిష్టముకొచ్చినట్లు కూయుడు మొదలై తే మిమ్ముల బరిమార్చుట కర్తవ్యముగదా.

వు-దర్వు॥ యిందులకేమియు పాయముమూ జేయందగు మనకికా ॥యిం॥ పొందుగ బ్రజలను పోషింపకను - న్నందుల జయమే యవనీశులకున్ ॥3॥

ఉ॥ యెంతని జూచువాడయిక ♦ నెట్టుల నోర్చియు నూరకుందుని
ట్లెంతటి కార్యముల్ జరుప ♦ నెవ్వరువానిని నాపువారువా
యెంతటివాని మాత్రమిట ♦ లన్నను జంపదెయూరకున్నచో
గొంతుల గోయదే ప్రజల ♦ గోతిని ద్రోయుటదెంత వానికిన్॥

వ॥ కావున ధీవిశారదా నాకేదియున్ దోచబడుటలేదు యిందులకేదైన యోచించి తెల్పుము.

ధీ-ద॥ ఫారుణీయందుననూ శ్రీచౌలమద్దిహారీ ॥ధా॥ కారుణ్యంబును గల్గునెట్టులో - దూరభారము విచారింపగలవె ॥ధా॥ ౪॥

గీ॥ వానికీక్షింపనగినట్టి వరుసతోడ ♦ మీరలైవచియింపగావ లెధీర
తోడ ♦ బట్టి వధియించునాతని నెట్టులైన ♦ బంధనము జేయగావలె పాపమనకా॥

వ॥ కావున రాజేంద్రా మన సేనానాయకుండగు పరాక్రమునికి సెలవిచ్చితిరాయనా క్రూరసేనుంబట్టి బంధించి బంధిఖానలో యుంచగలడు శెలవిండుస్వామీ.

క్రూ-వ॥ యీమంత్రికేకాక మరియితరులకుగూడా మృత్యుకాలంబాసన్నంబైనది కానిమ్ము సేనానాయకుండగు నా పరాక్రమునిగూడ ధీవిశారదునకు సహచరునిగా యమలోకమున కథితునిగా జేసెదగాక.

వు-వ॥ సచివాగ్రణీ నీవనువిధంబె రేపటి ప్రాతఃకాలమందున యద్దురాత్మునింబట్టి చెరసాలయందుంచమని మన సేనానాయకుండగు పరాక్రమునికి నాజ్ఞాపింపుము యిదే నేనంతఃపురంబు ప్రవేశించెదను. (అని వెళ్ళిన క్రూరుండుతనలో)

క్రూ-వ॥ ఔరి పిరికిపందలారా నేటిదినమునసే మిమ్ముల బరిమార్చ దలచియున్న నన్ను రేపటికి బంధింతురా ఆహా నన్నుగురించి యెంత కార్యమున్ దలపెట్టి యున్నవారలు.

కర్ణారుడు క్రోధముతో అనుబంధము

రొటుల సహింపగ వలయుర్ - యిటులను నాయడదలచిన వీర లర్ - కటిలాత్ముని బట్టియుర్ - తటకునబడగొట్టియుర్ - రొటులై నను జయముగొందు ॥ రొ॥౧॥ వీరలపై కరుణదలచి - యూరకున్న మోస ముర్ ఘటించును - అరయ పరికించను కూరిమిలేకను వైరులగూల్చుట యేకర్తవ్యము ॥రొ॥౨॥ మరియు రేపటిదినంబు చెరసాలలో బట్టియు వేయుదురటా - జయమును గొనియెదరటా ధరణియందు చాలమద్ది కూరి రొటుల బ్రోవగలడో॥

గీ॥ రోగియన్నను సరిగనా రోగమునకు - దగిన మందిడిమాన్పుట తగునుగాక - అట్టిమిమ్మల బరిమార్చి యావనియందు - యేనునిశ్చింత గానుండు మానితముగా॥

వ॥ యాధీవిశారదుని నన్ను చెరశాల నుంచెడు పరాక్రముని మొదటనే సంహరించి యావెనుక మాయన్నను వధించెదగాక సరే కాని వీరశూరులింకను నాయడకు రాకయున్నారు కారణం (వారునవ్వుచున్నం గాంచి) అదో నేననుకున్నంతలోనే వచ్చుచున్నవారుగదా మంచిది రానిమ్ము. (అంత వీరశూరులు విచ్చేసి కర్ణారసేనునితో)

వీ-వ॥ కర్ణారసేన మహారాజా మీకిదే పదివేలు వందనంబు లొనరించుచున్న వారము కటాక్షించి మీరుంజేయు ఆలోచన యేమిటో మాకెరిగింపుడు దేవా.

కర్ణా-వ॥ వీరశూరులారా వర్ధిల్లుడు వర్ధిల్లుడు అహామీవంటి పరాక్రమవంతులు నాయొద్ద నుండగా నాకెంతమాత్రను కొరంతయు గలుగ బోదు గాని నేడొక వింతజనించినది యదియుం దెలిపెద నాలకించుడు.

## దైలాగ్

విన్నవింతు వినుమికనా విన్నపంబు వీనులలరా- నన్నుగూర్చియు జేసిన మాయన్నగారి ప్రతిజ్ఞలర్ - పన్నుగ రేపటి ప్రాతఃకాలము కన్నులతో జూడగను - యిక మన్నింపక చెరలోనుంచుండని మరిమరి క్రోధంబునను - బల్కెన్నవిను - పరాక్రమునకు దెలిపెను ॥విన్న॥

గీ॥ తమ్ముడనియెంచకిట్లు నిర్దయపలంచి ♦ చరలనుంచుమటని ధీవిశారదునకు ♦ నాజ్ఞ యిచ్చెగదా సేననాయకునకు ♦ యేమిసేయుదు దీనికేనెట్లులోర్తు॥

వ॥ కావున దీని కేయుపాయంబూహించెదరో తెల్పుడు నాకెటు దోచకున్నదిగదా.

పీ-ద॥ యెంత కాఠిన్యము దలంచెను యింతలో మీయన్నయున్॥ యెంత॥ పంతగించెను నీవుజేసిన పాపమేవని యెంచియున్- యింతటికై మీమనమందున భావంతము గొనియున్నారో- యిక చింతేలను వేమును తోడై మీచెంతనుండ నగధీరా- యిపుమంతనైనా స్థైర్యము గొనవలె సుమ్మి ॥యెంత॥౨॥

గీ॥ నావకునిరీతి నోడను నడుపుటకును ♦ మేలు గలుగంగ భయమేమి స్వామియెడల ♦ లోపమంజేయు మెప్పుడు లోభివిధము ♦ యింక భయమేమి వారికి జంకనేలా॥

వ॥ శూరాగ్రేసర చక్రవర్తులగు తమరి నింతగా మాటలాడెనా యాతనికిసుమంతయిన భయంబులేదు కాబోలు అయ్యో యిందులకై తమవంటి వారలు దీనవచనములు బలుకుట పాడియా.

క్రూ॥ వ॥ బేష్ బేష్ వీరపాలా నీవంటి భటుడు నాకెన్నడు లభింపడు నీధైర్యసాహసంబుల కేను మెచ్చినాడ సరే కాని యిటువినుము.

క్రూ॥ యిందులకునై యొక్కపని నాడెందమందున దలచితిన్ - అందుకాపని జేయమీరేమందురోయని యెంచితిన్ - యెందైననునాసరి బలాఢ్యులిలా - యందునగలరా యెంచన్ - యమందబుద్ధిగల మాయన్నయుబహు నిందించెన్ - సభన్గాంచన్ - యికపొందుగనే జయ. మొందే దెరుగడు॥

వ॥ కావున శూరులారా యిందులకు నేనొక్కపని జేయదలంచుకున్నవాడా అని యిందాక యూరకున్నవాడా దానికి మీరేమందురో కదా

పీ॥ ధారుణిన్గల చోలమద్ది విహారుడా హరినెంచికన్ - మీరుదలచిన పనియెట్టిదో కూరిమితో దెల్పుండికన్ ॥ధా॥ యేరిమీసరి పురుషార్థముగల వారీలోకంబున నూ- మీశూరత్వంబింతని యనరాదా దయ పరికింపగను - బల్ మేరుసమాన సుధీరులు వీరులు ॥ధా॥౪॥

గీ॥ జగతియందుననినుబోలుచతురుడెవడు ♦ వైరిపాలిటినృత్యువై వరులుచుందు ♦ నీదుశక్తియసామాన్య నేతయెవడు ♦ జాలడీయది సత్యమింకేలభయము॥

వ॥ నిర్వక్రమ పరాక్రమవంతులగు తామిందులకై చింతించుట

కడు వింతగా నున్నది మాయన్నయే గాదు త్రిలోకాధీశు లొచ్చినను మిమ్ముల బంధింప జాలరను మాటనిక్కము మమ్మాటికి నిక్కము గాని మీరుదలంచిన పని యెట్టిదో తెల్పుడు.

క్రూ-ఉ॥ దాయలు దాయటన్ననిట ♦ దాపర మైరిక వేయునేలబల్
హేయముగాదె వారుకడు ♦ హీనదరిద్రులు వారిలెక్కయే
దాయలజంపువాడరణ ♦ దర్పముజూపెద నన్నెరుంగరే
పాయకవారి జంపెదను ♦ బంధననెట్టుల జేయనెంతురో॥

వ॥ కావున వీరశూరులారా ప్రధమమున మంత్రియగు ధీవిశారదుని యీ సేనానాయకుని ద్రుంచివైచి పిమ్మట మాయన్నయగు నుడయసేనుని శిరము ఖండించి యతనిభార్యను మోహించి వరించెద వింటివా.

శూ-వ॥ భళిభళి యిదిమంచి కార్యముగానున్నది మీరుదలంచిన పని కాకతీరునా అవశ్యకముగా నటులే జేయవలయును దీనికి మీరిక వెనుకందీయరాదుగదా రాజేంద్రా.

వీరుడు విస్మయంబొంది తనలో

వ॥ ఆహా శ్రీహరీ యిదియెంత మహాఘోరకృత్యము అబ్బాయిట్లు జేయుట అన్యాయము యిది మిక్కిలి పాపంబుగదా యీతడెంతటి కఠినంబు దలంచుకొన్నవాడు అందులకే వీనికి క్రూరసేనుండని పెద్దలు పేరు నిర్మించి యున్నారు యుక్తాయుక్త మిసుమంతయు లేక కీలు బొమ్మవలె నాడుచుండును యీపాపపుపని కూడదని నాకిష్టము లేదని చెప్పినచో మొదలైతే నన్నే శిక్షించును మంచిది దీనికొకటి పన్నాగము బన్నెదగాక (వీరపాలునిజూచి క్రూరుడు)

క్రూ-వ॥ వీరపాలా నీవేమో యాలోచింపుచున్నవాడవు అది యెట్టివిచారమో దెల్పుడు.

డైలాగ్

వీర-ద॥ యిటులజేయనాట తగునా - రాజేంద్రా ॥యి॥ కటకట యిట్టిపాప - కార్యము దలపోయుట - యెటులగో రెమీమానమూ - యెవ్వరైనా మెచ్చగలరా ॥యిటు॥౧॥

గీ॥ అన్నయనుస నతని తండ్రిగా నెన్నవలయు ♦ వదినెయన తల్లి సమమని మదిదలంచ ♦ వలెనటంచును పెద్దలు బలుకుచుండ్రు ♦ గాన మీరిట్లు కౌటిల్య మానవలదు।

వ॥ నరేంద్రా మాయన్నగారు యెంతటికఠినము నీపై దలంచినను మీరిట్లుజేయ పాడియా యిందులకు వారికేదైన యొకశిక్షయివ్వడుగాని చంపకుడు అయినను వారినేవిధము సంహరింతుజా.

కృ-దరు॥ యోచనజేసే దేమికనూ - మదియుచింతాయుచిత ము లెన్నకనూ - యింద్రాయుధముచు గొనివేగము — యీరాత్రి వానిఁ ద్రెగకోతును । యో॥ ౨॥

గీ॥ నిద్దురించిన మాయన్న నిట్టిరాత్రి ♦ జంపనెంచితి నిట్లుగావిం పవలయు ♦ మున్నుజంపడె ప్రార్థుండు గన్నసుతుల ♦ ద్రోణుతనయుండు నిశిదిని ద్రోహుడనుమా॥

వ॥ వీరపాల యన్నైన యేమి నాయన్నైనయేమి తనకుద్రోహం బుజేయువారెవ్వరైనా శత్రువులనంబడుదురు అట్టి శత్రువుల ద్రుంచినా నేమిపాపము నీవీ శ్రీరంగనీతులు నాముంగిటం బలుకకు యిదే రాత్ర మున మాయన్నను నిశ్చయముగాజంపకమానను. చూడుమునాప్రతాపము.

వీ-వ॥ (తనలో) ఆహా శ్రీహరీ యిదియెంత కఠిన చిత్తముసేనెంత యుః జెప్పిన-నంతకంత క్రోధంబు బెరుగుచునేయున్నదే.

ప్రకాశముగా మహాత్మా

వీర-ద॥ మానవేంద్రామీరిటులా - దలపోయుటా - కానికార్య ములుయెట్టి - ఘనులకైనా జెల్లావు - పూనిజేసినను జయమూ - బొంద గలరెట్టులానూ ॥మాన॥౩॥

చం॥ గురుసుతుడట్లుజంపగను ♦ గూడెను పుణ్యము పాపమెంచకః
నరపతి పుత్రులందరుగ ♦ న్యాయమెయీవిధి యెట్టులాయెనా
కురువిభుగాంచవేమొభువి ♦ కోసముతమ్ముల బాధపెట్టినా
కరణిని మీకు బాపములు ♦ గల్గవె దుష్కృతి రిత్తపోవునే॥

వ॥ కావున క్రూరసేనా మున్నాకౌరవులు అశ్వద్ధామచే పాండ వేయుల పుత్రుల తలలుం గోయించి వారేపాటి జయమొందినారు నిర్వం శులు గానులేదా మీరింత బలపరాక్రమలయ్యి యుండి నిద్రించి యున్న వానింజంపుట యధర్మము గాదా నీకింత శౌర్యమున్నను యెదురుంజని యుద్ధమున జెయించుట క్షత్రియ ధర్మము వింటివారాజః.

కృ॥ యెంతైనః నేవినియేనా-వానింతలో దునుమక విడిచేవా ॥యెం॥ స్వాంతంబున వరచాలమద్రిశీ - కాంతునిదలచియు గందుజెయంబు న్నా

ఉ॥ ఆలము జేయుటన్న మన ♦ కాయద దిక్కగు వారు వేమిబల్
వేలవహాను వారలను ♦ పేక్షగజూచిన మిత్రరత్నమా
జాలిదలంప బోకుమిక ♦ జాలు భయంబిది యేలనానుడుల్
గేలిగనెంచబోకుయణ ♦ గించెదనన్నకు గల్గు గర్వముక్॥

కాబట్టి నామాట ప్రకారమే తప్పక మీరొప్పుకొని నేజెప్పిన ట్లొనర్పవలయును నేను బరాజితుండనైన లేక బంధింపబడినను మీకిష్టం బేనా యెదురుంజని యుద్ధంబు జేసి జయించితె కాని యిట్లు జయించుట పురుషార్థముగాదా యెట్లులయ్యినను కార్యము సాఫల్య మయ్యేదేదో యేదియో సాధింపవలయును వింటివా.

(వీరుడు తనలో)

వ॥ ఓహో కాబట్టిన కుందేటికి మూడేకాళ్ళనుచందంబున వీడు పట్టినపట్టు వదలకున్నాడే తనకుం దెలియను యితరులు జెప్పిన వినడు మంచిది యింక నొకమాట బలికెదగాక (ప్రకాశముగా) రాజేంద్రా నింక నొకమనవి చిత్తగించి యిటువినుడు.

ఉ॥ కౌరవ పాండవుల్ జెనగు ♦ కాలమునందున న్యాయవర్తనల్
కౌరవులక్ వధించి కల ♦ కాలము కీర్తినిబొంది పాండవుల్
గౌరవ మొందివారటుల ♦ గాకనిజంబుగ చోరవృత్తి మీ
కౌరవధింప జాలునొకొ ♦ యన్నను మన్నన లేక నీవిధిక్॥

వ॥ అయ్యా మీఅన్నను బలిమిన సంహారించియునీవెన్నాండ్లు జీవింపగలవు యెవ్వరికైన మరణంబు నిక్కంబేకదా యిట్టి యశాశ్వత శరీరమును శాశ్వితమని యెంచి యిట్లు దుష్కార్యంబులు జేసిన నరకబాధ కలుగును మంచిది మీయన్న దురాత్ముడైనను మీరుగూడ వారివలె దురాత్ములై యుండుటంతగునా అట్లు జేయకుడు నామాటవినుడు,

కృపాసేనుడు క్రోధంబున

వ॥ యేమీ నీవు నాకెదురు వాదింపుచు నేమొ నీతులు బల్కుచు నేజేయుపని యుల్లంఘణంబు జేయుచుంటివా యేమీ నాప్రతాపంబు నీకుఁ దెలిసియుండునుగదా.

వీ-వ॥ (తనలో) అహో యీదురుమార్గుండు నాపైకండ్లెఱ్ఱజేయుచు క్రోధంబు జెంచియున్నవాడె యిందులకొకయుక్తి గావించి కొంతద్రవ్యం నపహరించెదగాక (ప్రకాశముగా) రాజేంద్రా మీయాజ్ఞ కేను వేచియున్నా

యెన్నడైన మీయాజ్ఞలో మెదులక యున్నవాడనా సరేకాని నాకు రుణ బాధ గలిగి యెటుదోచబడకున్నదిగదా.

క్రూ-వ॥ యేమి నీకు రుణబాధ గల్గినదా నీవు యెవ్వరికి బాకి యుంటివో యెన్నిరూప్యములో తెల్పుము.

సీ-గీ॥ వాసిగల చౌలమద్దినివాసుడైన ♦ ఘనుడు వైశ్యుడు పడిగెల గంగరాము ♦ కివ్వవలె రెండువేలతని కివ్వకున్న♦ నొక్కఘడియైన తాళియూరుకుండడయ్యా॥

వ॥ కావున అట్టి పడిగెల గంగరాము శాహుకారికి రెండువేల రూప్యములు బాకి యున్నాడను అతడు నిన్నటినుండియు మాయింటి కొచ్చుచు చాల బాధపెట్టుచున్నాడు అట్టి రుణం దీరినట్టులైతె యిక నాకేమితొందర నుండబోదు పిమ్మట మీవెంట నుండి మీరుజెప్పిన పని చేయగలనుగదా.

(క్రూరసేనుడు తనలో)

వ॥ యీసమయంబున నితనికీవలయు ద్రవ్య మివ్వకున్నచో నే జెప్పినమాట వినడు వినకున్న నేదలచినకార్యము కాబోదు కావున యీ ముత్యాలహారంబిచ్చి రుణబాధయొదలుకొమ్మనియెదగాక(ప్రకాశముగా) మిత్రమా నీవేల చింతించెదవు యిదో నాముత్యాలహారము రెండువేల రూప్యంబుల వెలగలది కాబట్టి దీనింగొని యాపడిగెల గంగరాంసాహు కారి కొసంగి నీరుణమునుతీర్మానముచేసుకొని రావొమ్మయిదోగొనుము

(అని ముత్యాలహారము యిచ్చిన వీరుడుగైకొని)

వ॥ ఆహా రాజేంద్రా యిప్పుడుగదా నాబాధ మాన్పితిరి యిక నిట్టి ముత్యాలహారమా పడిగెల గంగరాం శాహుకారికి కొసంగి నా రుణము దీరినదని చెప్పెదను మీరైతె ముందునడువుడు.

క్రూ-వ॥ మంచిది నీవైతె వేగిరంబున రమ్ము అదో ప్రొద్దుగ్రుంకు చున్నది యిదేరాత్రము వెళ్ళి ధీవిశారదుని పరాక్రముని మొదలుఖండించి పిదప మాయక్కయగు వుదయసేనుని సంహరింప వలయును యిక నీవు బోయి త్వరగారమ్ము (అని వీరుడు వెళ్ళిన శూరుంగని)

క్రూ-వ॥ వరే వీరశూరా నీవీక్షణంబున వెళ్ళి చంద్రాయుధము గొనిరమ్ము ఆలస్యంబువలదు.

శూ-వ॥ దేవా అటులనె గొనితెచ్చెదానుబో నేపోవుచున్నవాడ.

(అని యిరువురు వెళ్ళిన వీరుడు తనలో)

వ॥ భేష్ భేష్ నేబన్నినయుక్తి ఫలించెనుగదా యీ ముత్యాల హారమైతె నాకే జిక్కినది యీధన మింతని చెప్పరాదు సర్వగుణాః కాంచన మాశ్రయంతీ యనుమాట సత్యంబేకదా యిది యెట్టులన్నను.

సీ॥ తలిదండ్రినిజయించు వలపునుగురిపించు ♦ మానినీమణులను మలుపుధనము ♦ దేశంబులనుద్రిప్పి దేవాలయంబులా ♦ నన్నృతంబు లాడించు నరయధనము ♦ కూటసాక్షింబులన్ గూర్చున్యాయమెుకింత ♦ బలుకంగనియ్యదీ పాడుధనము ♦ తెలివితేటలులేని దేబెలచెంతనే ♦ నిలచి మిక్కిలియుండు నిట్టిధనము॥ గీ॥ మరియునవ్వించు నేడ్పించు నరులనెల్ల♦ నరయ మన్నించుతన్నించు నవగుణముల ♦ నమరుధనమన్న సామాన్య మవునెజగతి ♦ నెన్న జాలము దీనినింకెన్నొ గతులూ॥

అనుబంధము

దర్వు॥ యీధనముయీధనమూ - యీధనమెంతో సాధనమూ యీధనమునగద యేపనులైనను - సాధనమగును యనాదులకైనను ॥ యీ॥ మేలుమేలు యద్దాలమేడలును - వాలాయకములును వాహనంబులును - వేలసేవకులు విటదాసీలును - పూలతోటలును భూముల నేకము- స్త్రీలకండ్లకును శృంగారునిగను - పాలునెయ్యిదధి పరమాన్నములును - పాలునిచ్చు బహు యాలచుందలును - చాలగనెంతో సౌఖ్యంబులును ॥ యీ ॥ ౨॥ పట్టెమంచములు పరుపులు మెత్తలు - పట్టు దుశాలల పచ్చడంబులు - పట్టెనిండబలు పీతాంబరములు - ఘుట్టిబిగల బంగారు కడియములు - అట్టెదిరుగుతనచుట్టుబంధువులు - బట్టుబ్రాహ్మణులబహుగ దీవెనలు - కట్టివిడువగను కనకాంబరములు - ఘుట్టిగ సౌఖ్యము న్నట్టె యిచ్చుభళి ॥యీ॥ ౩॥ యేకులమైనను యెక్కువనిపించును - ప్రాకటముగతన ప్రభువనిపించును - వ్యాకులమును బోవగజేయునుమది - యేకోంకలైన నిచ్చుతమ్మలపా - కులంబడియాల్ బహుగభోగముల అనేక సొమ్ములు నిక్షరపటిగా - లోకుల కండ్లకు రూఢిగ మెరియును - సాకల్యంబుగ సంతసపెట్టును ॥యీ॥ ౪॥ యెంచినపండిన యింటికివత్తురు - కొంచె గాడైన గొప్పగజూతురు - పంచబాణుసరి భాగ్యకుగనబడ - మంచివిచెడ్డలు మన్నింతురుమతీ- చంచలుడైనను చాలమద్దిహారి - నెంచెదు

వాడని యెంచుచునుందురు - యెంచగలోకుల నీధనమును - నవ్వించును తుదకేడ్పించును ఛీఛీ ॥యీ॥౫॥

గీ॥ పరమ పాపాత్ములకెటిక్కు పాతుధనము ♦ పుణ్యపురుషుల కడనుండ బోదుధనము ♦ తననుతిననివ్వ దొకరికిదానమైన ♦ నివ్వనివదిట్టి ధనగుణంబేమనందు॥

వ॥ కావున నేనీకర్వారసేనుని యాజ్ఞలో నుండి యెట్టిదుష్కార్యంబులయిన జేయునది యీధనము వలననేకదా అదియునుంగాక వీనిమాట వినకయున్నను యిప్పుడే చంపబూనును మంచిదికానిమ్ము కాగలపనులు గాకదీరవు.

విమలాదేవి ప్రవేశం దర్వు.

శ్రీరమణీవర - సింధూదయాకర - మారజనక యిటురావేరా ॥శ్రీ॥ సారసలోచన సజ్జనపోషణా ॥ స్వారాద్విధిమృగ సన్నుత కేశవా ॥ శ్రీ ॥ నందయెశోదా - నందనవరముచు - కుందవందితుడ వీవేరా ॥ శ్రీ ॥ మందరధర గోవిందహాని హృన్మందిర శ్రీధర మముదయనేలరా ॥ శ్రీ ॥ ౨॥ దీనజనావన దివ్యచరితమద - దానవహార యేదశవేషా - పూని చాల మద్దినగరీశ్వర ॥ శ్రీనారాయణ శ్రితజనపాలన॥ ॥శ్రీ॥3॥

చ॥ పరమదయాళో నీపతిత ♦ పావననామ మదేమిజేసితో
నిరతము గొల్చుదాన ♦ నవనీతలమందున లేరులేరుసం
బరమున రాగదయ్య నెడ ♦ బాయని ప్రేమను దాసిగాననో
సరసిజనాభ నీకుచెయి ♦ జాచినమమ్ముల నెమ్మిబ్రోవవే॥

అని చిన్నబోయియున్న విమలదేవినిగాంచి కీరవాణియను చెలియ యిట్లనియె.

చె-వ॥ అమ్మా విమలాదేవి నేడేమొ నీమోము చిన్నబోయి యున్నది ఆదెట్టికారణమో నాకుం దెలుపు తల్లీ.

యిరువురికి డైలాగ్.

వి॥ కామినిమణి నీకది యేమని తెలుపుదునే ॥కా॥ నామదికెంతో భయమే మేమెదోచుచుండేనే ॥కా॥౧॥

వ॥ కీరవాణి నేడేలనో నామనంబుమిక్కిలి తహతహలాడుచున్నది యిదియుంగాక నిన్నటిరేయి నొక దుస్వప్నముఁ గంటిని యద్దానిచే

మిక్కిలి గుందుచున్నది యదిగాక నాకుడిభుజ మదురుచున్నది యేమి గానున్నదో గదా.

కీ॥ యింతటికై నీమదీ చింతిల్లనేటికీ ॥యిం॥ కొంతైనన్ ధైర్య ముగొనవలె ముమ్మాటికీ ॥యిం॥

వ॥ తల్లీ విమలాదేవి కలలన్నియునిజంబౌన శరీరత్వము ననుసరించి యప్పుడప్పుడు హృదయంబు నదురుచుండును కావున జననీ నీకిది యేమి అనుమానము యిక నీకిట్టి చింతవలదు.

వి॥ కన్నియరో నీవు నాకెన్నియు దెలిపినను ॥క॥ యున్నధా వంతంబును యొడలియు బోదాయెనూ ॥క॥

వ॥ నెచ్చెలీ నీవు జెప్పినదంతయు నిజంబేకాని నేడేలనో కాని నామనోవిభుండు సభనుండి యింతవరకై నరాకయున్నవాడు కారణమేమై యుండవచ్చును.

కీ॥ సభయందుజర్గినా - సంగతియేమందునే ॥స॥ విభవాక్షినామది కడువింతైదోచనే ॥సభ॥

వ॥ దేవీ మనగృహంబున కప్పుడప్పుడు వచ్చుచుండు సత్యావతి కూతురును నీమరందియగు క్రూరసేనుడు చెరబట్ట దలంచెనట అందుకు దానితండ్రి మొదలయినవారు యింతకుమున్ను మనరాజుగారివద్ద మొర బెట్టుకొనుచున్నడన వింటిని అందులకై దడవు గావచ్చును.

వి॥ యింతటిదుర్మార్గము - నేరికైన జెల్లునా ॥ యిం॥ యింతిరో క్షత్రీయులా - కిదిధర్మమయ్యెనా ॥యిం॥

గీ॥ క్రూరసేనుడు తాజేయు క్రూరములను - పీడిప్రజలను క్రోవం గవెడలెనెపుడో - ననుచు శౌరినినుతియించు యనవరతము - మొక్కు చుంటిమి ముందేమి దిక్కుగలదో॥

వ॥ కావున యిట్టి క్రూరసేనుడు జేయు దురుమార్గములకయ్యో మేము భయంబు నొందుచున్నవారముగదా.

కీ॥ చక్రహస్తుడైనశ్రీ - చాలమద్దీ వాసుదూ - సక్రమముగా మిమ్ములా సవరించు శ్రీశుడు ॥చక్ర॥౬॥

వ॥ అమ్మా యగ్నివలన యినుముకు సమ్మెట పెట్లువచ్చినట్లు యీక్రూరసేనునిచే మాకులమున కపకీర్తియుగలిగి కష్టములేగలుగుచున్న వి నయ్యోదవకులముంజెరుపముసలముద్భవించినట్లు మాయింటనతండుజన్మిం

చియున్నవాడుగదా.

వి-చం॥ గతియెటులుండునో నిజము ♦ గానినిజంబు వచింప సఖ్యమే
సతతము నేడిపించెగద ♦ సమ్మతిగాపతి యట్టివాడుమా
కేది యొనగూర్చునోయనుచు♦ కేలునుమోడ్చిన గాంచడాతడే
క్షితినెటు కాలముక్ గడుపు ♦ క్షీణదశక్ క్షితి పాలుడక్కటా॥

వ॥ సకల జనంబులకు బిడ్డలవలె సవరింపకున్న రాచధర్మంబు గాదనియు ఖూక్రూరసేనుండు జేయు దురుమార్గములు నేనెట్లు సయిరింతుననియు యిదియెక్కడి సంకటంబులని నామనోహరుండు రాత్రింబగల్లు చింతాక్రాంతుండై యున్నవాడుగదా చెలీ.

కీ-వ॥ తల్లీ చింతపడకుము అదో మనరాజుగారు విచ్చేయుచున్న వారు వీక్షింపుడు. (అనిన విమలదేవి వచ్చుచున్న రాజు ముఖంబు జూచి కీరవాణితో)

వి వ॥ కీరవాణి అదో చూచితివా నావిభుని ముఖము వెలవెల బారినదై ముఖకళలు తగ్గిపోయినవి యదియేమి కారణమో తెలియదు.

కీ-వ॥ జననీ యది యెటువంటిదో యడిగి తెలుసుకొనుము యిక నేబోయెదా (అంతట నుదయసేనుండు విచ్చేసి కూర్చున్న విమలా)

వి-వ॥ మనోహరా మీకిదో నమస్కరించెదా కటాక్షించుడు.

(అనిన మాటాడకయున్న విమలాదేవి తనలో)

వ॥ అహో యిదియేమో నేడు వింతగానున్నదే వీరికెట్టిచింతగలిగి యున్నదో యెట్టికష్టంబులందైనను నన్నుగాంచిన తోడనే చింతలన్నియు మాయుననువాడు నేడీరీతిగా నుండు కారణంబేమోకదా.

సీ॥ ధనధాన్యరాసులుదహియించినను గాని ♦ చలియింపడీనాడు చపలుడయ్యె ♦ తలిదండ్రిబోయిన దానుగణింపడు ♦ యీనాటివ్రాత నేనేమనందూ ♦ కలనయిన భయమును దలపోయడీనాడు ♦ భయమెంతెనింకేమి బలుకినగడు ♦ క్రూరసేనుడుజేయుకుచ్ఛితములకైన ♦ యిసుమంత దానగడిదేమియెుకో ॥గీ॥ యేమిగతివచ్చెనో యది యనేక గతులా♦ దెలియ సంకోచమేమిటో గలిగియుండు ♦ చింతదోచెను నేనేమి సేయ ఫలయు ♦ అడిగినం దెలుసునట్టి సంగతులుటపుడు

వి-వ॥ (ప్రకాశముగా) ప్రాణవల్లభా యేల మీరిట్లు చింతాక్రాంతులై యున్నవారలు యిదియేమికారణమో నాకుం దెల్పుము.

అనుబంధము

వృదయసేనునికి విమలాదేవికి డైలాగ్

వృ॥ యేమని తెల్పుదునే - శోభామామణి నీశామహావార్తయు॥ యే॥ తామసమున మాతమ్మయ్యయుయిం - కేమి జేయగలడో మది దోచదు ॥యే॥౧॥

గీ॥ చంపె మొదటనె యాధీవిశారదున్ని ♦ యట్టె వధియించె నాసేనానాయకున్ని ♦ యిట్టినాకును మిత్రులైనట్టివారి ♦ నిడచిబ్రతుకేమి సేయ నీవుడమియందూ॥

వ॥ కాంతామణి నాప్రాణమిత్రులైన ప్రధానియగు ధీవిశారదున్ని సేనానాయకుడగు పరాక్రముని వధియించి యున్నవాడుగదా నేనిక తల లేని మొండెమురీతి నైతిని యికనేనేమి సేయుదును చెలీ.

(అని దుఃఖించుచున్న విభుని కండ్లనీరు దుడుచుచు)

వి-వ॥ మనోహరా యిదియేమి దుఃఖము యూరడిల్లుడు అహా యాకౄరసేనుడింత కార్యము జేసినడా.

వి॥ నామనోహరామీరీటులా- మానసమందున బెగడొందుటమేలా ॥నా॥ తాముయిట్లుమది ధైర్యము జెడినను నామనమందున నాకె చింతబహు ॥నామనో॥

వ॥ వల్లభా మీరేయిట్లు ధైర్యము జెడియున్నను మాకుధైర్యం బుజెప్పువారెవరు యెన్నికష్టంబులు గలిగియున్నను మీవంటి శూరులిట్లు ధైర్యంబు జెడవచ్చునా నాథా.

వృ॥ నారీనీవెన్నిబలికినా - యికనామనమునకు - ధీరత కుదురదు గదే ॥నా॥ కారణ మెట్టుల గానున్నదో యాకౄరుడు జేసెడుకుటిలత్వ మునకు ॥నా॥౩॥

చం॥ గతివచియింప నేలగల ♦ కష్టమెరుంగదె నీవుగూడనా
స్త్రీతివినియుండి నేడిటవి ♦ సీయిటు జెప్ప గన్యాకామానెవో
సతి యెరుగంగ లేదెమును ♦ సాంతము నేర్చెను మంత్రిసత్తముకొ
చతురతిదేల నింకపరి॥ చారులజంపిన యేనులెక్కయో॥

వ॥ వింటివా నాప్రాణతుల్యులనెల్ల గావించెను యీావిధంబున నే నన్ను గూడ చేయునని నాకు దోచుచున్నది యిట్లు జేయుటకు దూరు మున్నదా సఖీ.

వి-వ॥ నాథా యెందుకటులౌను మీరిట్లు యమంగళము పలుకులు పలుకకుడు నాథా.

వి॥ ధర చాలమద్దీశ్వరుడు - మిము దరి జేర్చును బ్రోచును - బ్రోచును జగదీశుడు ॥ధ॥ మరియిట్టుల ననుమానము గొనకను స్మరియించుడి శ్రీవరుని మరువకను ॥ధర॥ ర॥

గీ॥ పుట్టిగిట్టరే జనులిల నెట్టులైనా ♦ బరగజాతస్య మరణ ధృవం బటంచు ♦ వినియు గనలేదె దీనికి విధముమీరు ♦ చింతసేయంగ నేలనే వంతగనకా॥

వ॥ అట్లు గావునా సమస్త ప్రాణికోటులు పుట్టడము గిట్టడమున కయ్యేకదా యెట్టిమహాత్ములైన యెల్లకాలము జీవించియుందురా అయినను మీరిట్లు దావంతపడినను కాగల కార్యములు గాకతీరునా.

పు-వ॥ ప్రాణనాయకీ నావారుబోయిన పిదప నాదు దారియేది నన్నాకర్ణారసేనుడు చంపక మన్నించినగాని నేనే స్వయంబుగ ప్రాణి విడుచుట మేలని తోచబడుచున్నదిగదా.

వి-వ॥ నాథా యిట్టి యమంగళం పలుకులు పలుకుచుంటిరి యిది యేమి కారణం.

సీ॥ తలిదండ్రిగతియింప తనయులుబ్రతుకరే ♦ జగమందు నెవ్వారు జచ్చువారు ♦ తమ్ముడు బోయిన నెమ్మలోడనెయన్న ♦ గూడబోవునె వాని కొరతదీర్ప ♦ కులసతియెటులైన.గూడబోవునెభర్త♦ బ్రతుకగాలేక విభ్రాంతి పడునె ♦ మగడు బోయినమది తెగగుందియునుభార్య ♦ గూడ నరుగునెవాని గుణములెరుగ. ॥ గీ॥ నంతియెకాని చనిపోయినట్టి జనుల తోడబోవరు వానితో గూడదివికి♦ మఱిచివిరిగిన కొమ్మయు మ్రానుగాదే అట్టె జననసంతతులు వృద్ధి నొందుచుండు॥

వ॥ కావున నాథా దేహ సంబంధములైనవారు ఆత్మసంబంధులగుదురా మీరు సర్వంబును దెలిసినవారై యిట్లు యజ్ఞానంబులో ప్రవేశింపదగునా.

పు-వ॥ నారీమణి నీవు జెప్పెడివన్నియు లోక విభ్రాంతికే కాని వేరుగాదు యీకర్ణారసేనుడు నిర్దోషియైన ధీవిశారదుని పరాక్రమవంతుని జంపినవాడు నన్ను విడుచుటకల్లా యొకవేళ విడచియున్ననుగాని నాకంతమాత్రము యిద్దురాత్ముని చెంతనుండి బ్రతుకుటకు యిష్టము

లేకయున్నది బలిమిన ప్రాణములు విడుచుట మేలుగదా తరుణీ.

(అనిన విమలాదేవి దుఃఖముతో)

డైలాగ్

వి॥ యిదిమీకు మరియాదేనా - యిటుల సాహసము బూనా - మదికిచాలా - విచారా - మదిజేయుడీలోనా ॥యిదిమీకు॥

వ॥ నాథా తమకుంజెప్ప సమర్థత నాకుం లేదుగాని పాపములో గొప్పపాపము జీవహింసయేగదా మీరిట్లు బలిమిన ప్రాణ పరిత్యాగం బుజేసినను నరకంబంటదా అహర్నిశము మీరే దైవసమానులని నమ్మి కొనిన నాకేమిగతి జూపెదరు ముక్కుపచ్చలారని మనముద్దుల బిడ్డల గతి యేమి అయ్యో ధైర్యంబుజెడి యిట్లు బలుకంజెల్లదు నాథా.

వ॥ తరుణీమణీ నీకిది తగదే దుఃఖంబుమదీ ॥తరు॥ అరయ మన ప్రాప్తామెట్లా మరిదెల్పుదునె నీకదీ ॥తరు॥ ౨॥

గీ॥ తల్లిదండ్రులెవరు తనయులెవ్వరు ♦ భార్యయెవరు తనకు భర్తయెవరు♦ తెల్యుమింకమీరు దేహబంధులుగాని ♦ ఆత్మబంధులు మీర లౌదురెట్లు॥

వ॥ కావున కాంతామణీ యిట్టి యీషణత్రయ వాంఛలు దేహం బున్నంత పర్యంతమేకాని యీకళేబరమునుండి వెళ్ళిన ఆత్మలకిట్టి వాంఛ లుండబోవు అయినను మీయదృష్టం బెట్టులున్నదో యట్టులే జరుగగలదు కాగల కార్యంబులు గాకతీరునా యిందు మన పురుషార్థం బేమున్నది యదిగాక నాయాయుష్యంబునకు మీరుకర్తలుగారుగదా మీకుదెలి యదా చెలీ.

వి॥ ప్రాణముండాకను - ప్రభులుమీరౌదురా ॥ప్రా॥ ప్రాణాము కావలా పరమాత్ముడనియెందూరు ॥ప్రా॥

వ॥ నాథా మీరుందెల్పునది సత్యమేకానీ యసత్యంబుకాదు దేహ మున్నంతవరకైతె దేహసమ్మందుల సవరించవలయునుగదా అట్లు సవ రించకున్న దైవం బెట్లమెచ్చునూ యిందులకు నాకొక యోచన గనబడు చున్నది యదియేమనా.

చం॥ కొడుకును రాజుజేయుమెన ♦ గూడునుముక్తియు నట్లుజేసినన్
యెడదల దిక్కుదేదితమ ♦ రెన్నిన రీతిని పోదుకాలమున్

బుడుతల కేది దారిగుణ ♦ పొందికెరంగితి మీదుతమ్ముడున్
నడవడిజేసి మీరినెటు ♦ లైనడు జంపడె ప్రాణనాయకా॥

వ॥ కాబట్టి రాజ్యభారముల మనముద్దుపుత్రునకొసంగియుమనము వనాంతరమున కరంగి శ్రీహరింగూర్చి తపంబున్ జేయుటకర్తవ్యము యని నాకుందోచబడుచున్నది కావున మీరుదీనికంగీకరింపవలయును నాథా.

వృ-వ॥ (తనలో) అహహా యెటువంటివిగదా యీ యిల్లాలి మాటలు.

గీ॥ నావనడిపెడి చుక్కాని నావికువలె ♦ భర్త దౌర్భల్య మెల్లను బరగగాంచి ♦ మంచిమార్గంబు భర్తకు మానవతియె ♦ నిచ్చిచెప్పునే యెన్నడు హెచ్చుకథలా॥

వ॥ కావున దీనివాక్యంబులు శాస్త్రసమ్మతముగానే యున్నవి మంచిది యటుల యొనర్చి కీర్తివహింపవలయును.

వృ॥ చాలమద్దిశునీ సవరణనేగనీ ॥చా॥ మేలౌను నీవాక్కులూ - మెచ్చితిధాత్రినీ ॥చా॥

వ॥ జీవితేశ్వరీ నీపలుకులు అత్యంత శ్లాఘనీయములుగదా నీవన్నటులే మన కనకసేనునికి రాజ్యపట్టాభిషేక మొనరించి మనము తపంబునకు వెళ్ళుటే కర్తవ్యము వింటివా.

(అంతలో తార కనకసేనుడు ప్రవేశించి తలిదండ్రుల)

కనక-వ॥ జననీజనకులారా మీకిదే నమస్కరించెదా కటాక్షించి మీరుంకేయు ఆలోచన యెట్టిదో.

డైలాగ్

వృ॥ రారాధీలోలానాబాలా - రారసుకుమారా - కుమారా - రారనగధీరా ॥రా॥ క్రూరసేనుని కృత్యములెల్లను - ఆరూఢిగ నేమనివిని పింతును ॥రారా॥

వ॥ నాయిన్న కనకసేనా మీపినతండ్రి యొనర్చు దుష్కార్యములను గురించి నామది యెటుదోచక చింతాక్రాంతుడనై యున్నాడను యిక యేమిసేయనగును.

కనక॥ యేలావ్యాకులము - మీమనము - యీలీలను ఘనమా॥ నీలీల॥ ఆలములోన దురాత్మునిని దృంచియు - చాలగ జెనులను సవరించగవలె ॥యే॥౨॥

గీ॥ సైన్య నాథుని జంపె దుశ్శీలు డగుచు ♦ వాని విడచిన సంక
టంబెల్ హానివచ్చు ♦ బ్రతుకనిచ్చునె పాముకు పాలుబోసి ♦ పెంచినను
కరువకుండునే ప్రీతి నెరగి॥

వ॥ తండ్రీ అందుకా క్రూరుని జంపివేయక నేల యూరొకంటిరి
నరాత్ము లెవ్వరైనను శిక్షించి ప్రజలను సవరించుటయు రాచధర్మము
గదా మీకుం దెలియదా.

వృ॥ యోచింపగనిందూ । మరేమి శోచదు యేమాదూ । ఆచక
వానిని అంతమొనర్పినా । రాచకులముకిది రక్షపాలుగదా ॥ యో ॥ 3 ॥

గీ॥ రాజ్యలక్ష్మికి నాశించు రాజవరుడు ♦ దుర్మదాంధుడునైతన
తోడబుట్టు ♦ తమ్మునింజంపెనంచుయీధరణిజనులు♦నిందజేయరేపాపంబు
జెందకున్నె॥

వ॥ అట్లుగావునా కుమారా తోడబుట్టిన వాని నిట్లుజేసి యుద
యంబున మన మంత్రితో వాని చరసాల నుంచుడని చెప్పినందులకు నిది
యు వాడెరింగి ధీవిశారదుని పరాక్రముని సంహరించెనుగదా. యిట్టి
క్రూరుని యెట్లు శిక్షింపనగును తనయా.

కనక॥ భయమేలనుమీకూ । మనముకూ । పాపమనగబోకూ ।భ॥
జయమొసంగువర చౌలమద్దిహరి । నయముగ మనలన్నాదుకోగలడు॥భ॥

వ॥ తండ్రీ మీకింత ధావంతమెందుకు తెల్లవారు లోపలనే యేను
వానిని బంధించి కారాగృహ బద్ధుని జేసెదనమ్మ.

వు-వ॥ పుత్రా నీవు పసిబాలుండవు వారలు కడుదురాత్మర్గులు
వారిచెంతకు బోకుము తండ్రీ మీయక్క యగు తారయుతము నాయొద్దనే
పండుకొని యుండుడు రాత్రిమతిక్రమించినది నాయనా.

(తార తమ్మునితో)

తా-వ॥ సోదరా కనకసేనా పిన్నవాడవగు నీకాపనిజేయ శక్యం
బుయగునా తమ్ముడా యూరుకుండుము మన నాయన్నగారి యాజ్ఞ
మెలంగుటె కర్తవ్యము మనమిక పండుకొని యుందము రమ్మ.

(అంతలో తార కనకసేనుడు విశ్రమింతురు)

(వుదయసేనుడు విమలంగని)

గీ॥ కీరవాణిరో వినవె నాకేమొయివుడు ♦ కడుపులో బుగులు

దోఁచియు కరపదములు ♦ వణకుచును దేహమును పరవశము గలిగి ♦ యుండెనాకేటు దోఁచక యుండెనకటా॥

వ॥ యిట్లు యగుచు నాకేమో యెన్నడులేని నిద్ర కండ్లకు గప్పు కొని వచ్చుచున్నది యిదియుంగాక రాత్రియతిక్రమించుచున్నది కొంత నిదురించగా యీదేహ గుణములు శాంతినొందును నీవు గూడ పండు కొని యుండుము.

వి॥ వ॥ అకటా నేడేమో మాకు కడుదుర్దినముగా కనబడుచున్నది గదా. యేమాట బల్కినను యమంగళములే బల్కుచున్నారు యిది యేమి హేతువో తెలియదు. నాథా యిక మీరు పండుకొనుడు యేను కొంతవరకు మీపాదసేవ జేయుచుండెదా.

(అని భర్త శయనించిన పాదంబులొత్తుచు తనలో)

వ॥ యెన్నడు లేనిది మత్ప్రాణనాథుని ముఖంబేమొ తేజోవిహీనమై యున్నది నేడుదయమునుండి దుష్టలక్షణంబులుగలుగటచే కాబోలు ను యింకా ముందరేమి గానున్నదోకదా నాకుంగూడా ననేక నిద్ర వచ్చుచున్నది యింకను విశ్రమించెదగాకా.

అని భర్త పాదంబుల దిశకు పండుకొని యున్నంత కర్పూరసేనుండు వచ్చి మెల్లె మల్లెనా సమీపించి తనలో.

వ॥ నన్ను చరసాలలో యుంచ సిద్ధముగానున్న సేనానాయకుని మరియు ధీవిశారదుని మొదటనే వధించితిని యింక మాయన్న యేమి యున్నాడు యేడీ (అని అన్ననుగాంచి వీర శూరులతో)

వ॥ వరే వీరశూరులారా మీరిరువురు తార కనకసేనుల యొద్ద నుండుడు యెనిప్పుడే మాయన్నను యీచంద్రాయుధంబున సంహరించెదను చూడుడు. (వీరశూరులు)

వ॥ మంచిది మేమటులనే యుండువారము గాని యిక మీరాలస్యంబు జేయకుడు (అనిన అంతలో కర్పూరసేనుండు తన చంద్రాయుధంబున అన్నను నరుకును అట్టి ధ్వని విని విమల తారా కనకసేనులు అదరుపాటున లేచి హాహాహా యని కేకలు వేయుచుండ కర్పూరసేనుడు వీర శూరులు వెళ్ళిపోయిన పిదప కంఠంబుదెగి పడియున్న భర్తనుంగని విమలాదేవి తారా కనక సేనులు శవముపై బడి దుఃఖింతురు యేమనియు.)

వి-వ॥ ఓ జీవితేశ్వరా మమ్ము విడనాడి పోయితివా (అని పడును)

తా-క-వ॥ హా జనకా మమ్మువిడనాడి పోయితివా యిక మాగతి యేమి.          (విమలాదేవి అనుబంధము రూపకం)

వి॥ నాథా। నన్ను వీడనాడి పోయితివా। నిన్ననాతో బ్రతికి యుంట్రి। కిష్టము లేదనియు యిట్లా॥ బన్నియుంటివయ్యయ్యోనీ। వన్న రీతి నయ్యెనహాహా ॥నాథా॥౧॥ యింత కార్యమవునని నేనెంతమాత్రమెరుగ నైతి। కాంతనిన్ను బాసియు। జీవింతునెట్లు ప్రాణములతో ॥నాథా॥౨॥ పాపి క్రూరసేనుడింత పనియు జేసే నీవుయేమి। పాపము జేసితి వతనికి బలిమిన నీప్రాణిడిసె ॥నాథా॥౩॥ నన్ను బోలుదురు భాగ్యులు ।నున్నరా యీలోకమందూ। చెన్నగుళ్రి చాలమద్ది। వెన్నునికృప యేటు బోయెను ॥నాథా॥

వ॥ హానాథా నాథా నీవేమని తలంచుకున్నవోయ దేరీతి ప్రాణములు విడిచితివా యీక్రూరసేనుడు నన్నుగూడ నీవలె సంహరించినను నాకీ దుఃఖంబుండక పోవునుగదా యిక నేనీ భూమిమీద నెటుల ప్రాణంబులతో బ్రతికియుందును నీతోడనే నన్ను గొనిపోరాదా మనోహరా.

తార కనకసేనులు - అనుబంధము ఆది.

తా-క॥ హాజనకా మీయాత్మజులమగుమం - మ్మీజగమున విడి యేగితే దివికిన్॥ భూజన నుతమహా - పుణ్యులు మీసరి రాజవరులు యెవ్వారు ధరణిన్ ॥హా॥౧॥ బలిమిన ప్రాణముబాయుమనియునా - నలు వ్రాసి యున్నాడో ఫాలమునన్ - పలువిధములనీ ప్రాణము లెంతయు - కలకల పడియెనో ఘనముగ నకటా ॥హా॥౨॥ నీతమ్ముండును నీకుజముడై నీతోడను జన్మించియునుండెన్ - నీతరి మమ్ముల నెవ్వరు కరుణయు - జూతురు మాగతి యేతరిగలదో ॥హా॥౩॥ పాలుమరువని బాలులమగుమం మేలవిడచిపోయితివి యిదితగునా - చాలగ్రీకరచాలమద్దిహారి। యేలీలను దరిజేర్చునో మమ్మలా ॥హా॥౪॥

వ॥ హా తండ్రీ పసిబిడ్డలమగు మమ్మెవరి పాలుజేసి పోతివి హా జనకా మీకెంతటి బలిమిచావు గలిగెను నీప్రాణంబెంతతల్లడిల్లెనోకదా (అని తల్లిపై యింబడి హాజననీ యికమనకెంతటి కష్టకాలము సంప్రాప్త మయ్యెను యికమన కేదిదిక్కూ.

విమ-వ॥ హా నాముద్దుల బాలులారా మనగతి యెంతకువచ్చెను

(డైలాగ్)

కనక॥ అమ్మరో గతియేది - మనకికాపులెవరూ - యిమ్మహీ మాతండ్రివలెను యెవరు జూతురూ ॥అమ్మ॥

వ॥ జననీ యిక మననాదుకొనువారు యెవరు మనముగూడ జనకునితోడనే జనియుంటె మేలని తోచబడుచున్నదిగదా తల్లీ.

వి॥ పుత్రకా నీవిట్లుబలుకా బోకుమీయెడన్ - ధాత్రిలో మన ప్రాప్తమెటులో దలచిచూడగన్ ॥పుత్ర॥౨॥

వ॥ తనయా మీజనకుని తోడనే మనము ప్రాణ పరిత్యాగంబు జేసినదే మేలని పలుకుచుంటివైతె యదియు మన యనుమతిలోగలదా మనమింక యెంతకష్ట మనుభవించవలసి యున్నదో యవి యన్నియు గడుపక తీరునా మన యదృష్టమే మంచిదైనచో మీజనకుడేల గతించును ఆహా యెంతటి దుర్భాదృష్టులము కుమారా.

కనక॥ యింతఘనంబైన పాప - మేమీజేసితిమీ - స్వాంతములో నందరి మనసమము జూసితిమీ ॥యింత॥౩॥

వ॥ తల్లీ యిదంతయు పూర్వజన్మంబునన్ జేయు పాపకృత్యమే కాని మరేమియుంగాదు మనబ్రతుకు యడవిం గాచిన వెన్నెల విధం బాయెనుగదా జననీ.

వి॥ ధారుణిశ్రీ చోలవృద్ధి - ధాముడేలునూ - కూరిమీనా పుత్ర చింత గొనకు మదిననూ॥

వ॥ అయ్యో నేనిట్లు యేడ్చుచున్న పసిబాలలు గుండెజెదిరి యుందురుగదా అయిన కార్యంబునకు చేయునదేమున్నది ధైర్యంబు బూనుటే కర్తవ్యము కుమారా యిట్లు ధైర్యంబుజెడి దుఃఖించుచున్న మన నోదార్చువారెవరు కాగల కార్యంబులు గాకతీరునా యిక నీవిట్టి దుఃఖంబుమాని మీతండ్రిగారికి దహనాది యుత్తర క్రియలు గావించుటే ముఖ్యముగదా కొమారా.

కన-వ॥ తల్లీ అటులనే గావింతము లెమ్మా.

అని యిట్లుభయ సేనునికి పుత్రక్రియలు గావించి యున్నపిదప కర్ణాటసేనుడు విమలను చేతం బట్టుకవచ్చి.

కర్ణా॥ విమలా యిటువినుము.

ఉ॥ యెక్కడి కేగినన్ విడువ ♦ యెవ్వడు నడ్డము వచ్చువాడునీ
కెక్కడిదిక్కు దెల్పుమిక ♦ నెవ్వరు సాయము జేయువారలో
చక్కనిచుక్క నీకుచెయి ♦ జాపితి గావక నెందుబోయెదో
తక్కరి నానుడుల్ వినుము ♦ దాన సుఖంబులు నీకుగల్గెడిన్॥

వ॥ కావున సుందరీమణీ నేటినుండి నన్ను నీభర్తగానెంచి నాతో సకల సుఖంబు లనుభవింపుచుండుము యేనుగాక నీకెవరుదిక్కు.

వి వ॥ (తనలో) అహో యిదియెంత పాపము యీ దురాత్ముడు నాభర్తను జంపించేదేగాక నన్ను రతికేళికి రమ్మని బలిమి జేయుచున్నడే హా జీవితేశ్వరా యిట్టి పాపకృత్యంబు నీవుంజూడ నోపకముందుగనే మరణించితివా హా ప్రాణవల్లభా అహో నాథా నాథా నీవెచ్చటి కేగితివి యీభాధ దప్పించి నన్ను గొనిపోరాదా దైవమా.

(అని మూర్ఛిల్లియున్నంజూచి కర్వారుడు)

డైలాగ్

కర్వా॥ కాంతామణిరావే - ననుకొంగాలించుకోవే ॥కాం॥ యింతి నీపైనిమది భ్రాంతి గలిగున్నాడను ॥కాం॥౧॥

వ॥ సుందరీ మాట్లాడ వెందుకు నీటక్కరి చేతలన్ని నాకుచక్కగా దెలియును యిట్లు ప్రాణము లేనిదానివలె భూమిపయింబడినను యేను విడచి పోవువాడను గాను లెమ్ము యొకసారి కౌంగలిమ్ము చెలీ.

(అని లేపి కూర్చుండబెట్టిన విమల తనలో)

వ॥ హా మనోహరా నీవెచ్చట నున్నాడవు యీకర్వారుని బారినుండి నన్ను విడుపించుటకై రావెందుకు నాథా.

కర్వా-వ॥ సుందరీ నీ మనోహరుండు యెందున్నవాడని గుందుచున్నదానవు నన్నే మనోహరునిగా భావించుకొని నావరితాపంబు దీర్పుము చెలీ.

వి॥ తగునటె మాకురాజేంద్రా - యిత్తరిన్ నన్నుగోరన్ ॥తగు॥ జగతియందు నిట్లు పదినెలనుగనీ - తగవచించువార లున్నరుమది - పగదలంచ శోకుమీకు - నమస్కరింతు - మదిదలంతు ॥తగు॥౧॥

గీ॥ జారిణింగాను నన్నిటు జాలిగొనవూ ♦ అన్నభార్యనుగద నిన్ను గన్నతల్లి ♦ విధమటనియెంచు కొనుడికన్ విహితమంచు - వినగవలెసుమ్మి నామాట వీనులలరా॥

వ॥ అయ్యా మీయన్నను జంపినాయెనా శాంతింపక నన్నిట్లు దుర్భాషలాడుట న్యాయమా. యికనయినా నాయెడ కృపదలంచి వీడి మరి మెచ్చటికయిన మీకుందగిన రసికురాలిం జూచుకొని మీకుంగల కోరిక దీర్చుకొనుడు. మీకిదే నమస్కరించెద.

కర్ణా॥ యిందుముఖినీ పలుకులకేను - మెచ్చియుంటినీ ॥యి॥ అందముగా నాకోరికయుం దెలిపెద వినుమంటిని ॥యిం॥3॥

గీ॥ రాత్రిబవలును నిన్నువో రాకవదనా ♦ కలయగానెంచి యన్యులగాంచనైతి ♦ నిపుడు మానంగ తరమానె యట్లుబలుకా ♦ యెట్టిన్యాయంబు నామాట లింకబినవే॥

వ॥ కావున మోహినీ నీవు నాకు చక్కనిమాట జెప్పితివి యేను నిన్నుగాకా కన్యస్త్రీలగోరి యుండలేదు మిక్కిలి నీయందే భ్రాంతి కలిగున్నవాడను కంటివా.

వి వ॥ (తనలో) అక్కటా యీకలుషబుద్ధి యొక్కటే పట్టుబట్టియున్నాడుగదా. యికనన్నేమిజేయునో హాపరమేశ్వరా నా పతివ్రత ధర్మంబు గాపాడి నన్నేలుకొనుము (అనియూరకున్న)

కర్ణా-వ॥ విమలా మాట్లాడవెందుకు యొకసారి నాతో సరసవచనంబు లాడుము తాళకున్నవాడను.

విమ॥ యిదియేమి నీదు దుర్బుద్ధీ - వినవేలా నాసుబుద్ధీ ॥యి॥ మదికిచాల దూరభార మెంచియూ - మానవలయు యిట్టి దుర్గుణంబులు పిదపయెట్లు శౌరిమెచ్చునినుయీ వైరితనము విడువు గనుము ॥యిది॥

ఉ॥ చావగనుంటి నేనికను ♦ చాలులమించెడి కోర్కె తీరునే
గావగ నెంచవీవుకుల ♦ కాంతలకిట్టిది న్యాయమానెనా
దేవుడుబోయె వెంటనరు ♦ దేరఫలంబిది యేమినీకునా
పూవిలుకాని సాయకున ♦ బూనితి వంతియె నన్నువీడుమా॥

వ॥ మహాత్మా నన్ను మీరిట్లన బాడియా నాబోటి దీనురాలనెవ్వరైనగా బాధ పెట్టినను మీబోటి శూరులు రక్షించవలయుగాని యిట్లు పాపకార్యము దలుపగనగునా ప్రాణము లుండునందాక యిందుకు సమ్మతింపను యికనైన కరుణింపుము.

(అని పాదంబులపై యింబడిన కర్ణారసేనుడు కాలుతో దన్ని)

కృ్ణా-వ॥ యేమీ నిన్ను కరుణజూచుటయా యదియెట్టిదో నావు ట్టుకనుండియే లేదు. యిట్టి శ్రీరంగనీతులు చాలుందరేమీ సాగంతోవు నమ్మెము.

కృ్ణా॥ నీవేదాంతంబులును - నీకే జెల్లునుగాని ॥ నీ ॥ భావింపగ నాకొప్పదు - భామామణి నేవింటినీ ॥ద॥౫॥

చం॥ వలచినదెల్ల రంభగునె ♦ వారికిమోహము కన్నుగప్పవో
యాలికులవేణి నీవిటుల ♦ నన్నన జెల్లునె భూరిప్రేమచే
వలచినదెల్ల రంభయగు ♦ వావులు గల్గునె కేలిగూడనా
దలవును నిట్టిదేమదిని ♦ దల్పుచు నాతగు వాంఛదీర్పవే॥

వ॥ వోసీ దురాత్ములారా యెంతజెప్పిన నామాట వినక యున్న వుగదా నామాటలు బూడిదలోనేయిబోసినచందంబయ్యెనుయికనిను బల వంతముగా గాఢాలింగన మొనర్చి కామకేళి గూడిన నెవ్వరునడ్డగించు వారు చెలీ అని కౌంగలించుకొన్న విమల తప్పించుకొని తనలో.

వ॥ అకటా యికనాగతీయేమీ హా సర్వేశ్వరా నాయెడ నించు కైన నీకు కరుణ రాకయున్నదిగదా ప్రస్తుత మీతని నేనెట్లు దప్పించు కొనగలను. (ప్రకాశముగా) అయ్యా.

విమ॥ వినగలేదె శాస్త్రంబులికన్ - గనగలేదె ధర్మములన్ ॥సు॥ ఘనముగాను యిట్టి విషయవాంఛలు గలుగువారికెల్ల నరకమనియును - ఘనులు చాలవద్దీ శౌరిభక్తులూ - వినువగాను - వేదములను ॥విన॥

ఉ॥ కాలుడు గాచునేనినుయ ♦ కావు మృత్యువు రాదెనీకునన్
జాలదలంప శ్రోవుమరి ♦ చారినెదాసినె నన్నుభార్యనే
లీలవరింపగానగునె ♦ లేదె రమాధిపు డిందునందనన్
జాలదె నిన్ను మాననువి ♦ చారమొకింతయు చింతజేయుమా॥

వ॥ కావున యింతకు మించిన రవరవాది నరకంబె ద్దియైనం గలదా పండితులు జెప్పెడు వేద శాస్త్ర పురాణేతి హాసంబు లబద్ధమా యిట్లు దుర్నడకలు నడచీ యూరికె నరకముల పాలయ్యెద వెందుకూ యికనైన మంచిబుద్ధి దెచ్చుకొనుము.

కృ్ణా-వ॥ విమలా నీవు బల్కిన వన్నియునిక్కంబా వేదశాస్త్ర పురాణేతి హాసములన్నియు నబద్ధమేకదా యెవరో ప్రౌఢులొక వ్రాసి

మునులపేర్లు దగిలించినారు యొకవేళ్ళ నా మునులే వ్రాసినను బారెడు గడ్డములు బెట్టుకొనడముదప్ప మరేమియుం దెలియదు యేను సకల శాస్త్రములంజదివి తెలుసుకొని యున్నాడను పాపం బెచ్చటున్నది పుణ్యం బెచ్చటున్నది నీవెన్నడైనంజూచి యుంటివా నల్లగుండునా తెల్ల గుండునా యిక నీశుష్క వేదాంతములు నాముందరేమి సాగవు నమ్మ్రుము.

వి-వ॥ (తనలో) ఆహా వీడెంత దుర్మార్గుండు వేదశాస్త్ర పురాణము లన్నియు అబద్ధంబని యెంత నుపన్యసించెను హా శ్రీహరీ దాటవీలు గాని కష్టములుం బెట్టితివా తండ్రి. (యని యూరొ్కనును.)

దైలాగ్

కన్యా॥ పలుక వేమెవో భామామణినాతోక్ - నీవలగియున్న వేమీ కారణం ॥ప॥ కలికినాతో నీవును పలుకకున్న నోర్వనూ - బలుకు మొకటి చిలుకపలుకు వగల్ ॥పలు॥

వ॥ పిచ్చిదానా నీవేమో లేనిపోని వేదాంతములు బలుకుచు ప్రొద్దు గడుపుచుంటివి యొకవేళ పాప పుణ్యంబులు నిజంబని యెను కొన్నను ముందటి వారెందరో యిల్లు జేసి సౌఖ్యపడలేదా అట్టికథలు ప్రొద్దుబోవుటకు వ్రాసియుండలేదా యిందునుగురించి యెంతకాలంబైనను నుపన్యసింపగలను వింటివా యికనయిన మూర్ఖింపక నా చెంత జేరుము.

వి-వ॥ (తనలో) పాపభీతిలేని యీపాపాత్మునకు నేనెన్ని నీతి వాక్యంబులుక్ బల్కినా నేమి ప్రయోజనము (ప్రకాశముగా) మహాత్మా తమకుం దెలియని ధర్మశాస్త్రంబులుక లేవుగాని యింక నొకమనవి చిత్తగించి ఇటువినుము.

వి॥ తగదయ్యా మీకింతా - తగనీ కార్యముకై యింతా - వగ లేల బలికేరు నే - మిగుల పతివ్రతను సుమ్మీ - అగడు జెందిననీకూ - నౌదాన గానుపొమ్మి ॥తగ॥ ౨॥

గీ॥ చావ సిద్ధంబుగానున్న చానకిపుడు ♦ ప్రేమ యననేమొ మోహంబు ప్రీతియేమొ ♦ చచ్చి చావక సిద్ధమై చావుకోరకు ♦ గాచు కొనియుంటి ననుజంపు కరుణలేకా॥

వ॥ యేను ప్రాణంబులు బోయిన నోర్చెదను గాని యీపాప వహ్నిజ్వాలకుంజిక్కజాల తమింపుడు నాపాతివ్రత్యమునకు కళంకము

దెచ్చుకొనజాల పూర్వమెందరో పతివ్రతా శిరోమణు లధికముగా కష్టముల పాలుగాను లేదా యిట్లుకష్టపడి తుదకు సర్వసౌఖ్యంబులన్ బొందియుండిరి వింటివా,

క్రూ-వ॥ (తనలో) ఓహో నేనెంత వెరిపించినను దీని మనస్సు కరుగకున్నది గదా మంచిది వీరశూరుల నిందు రావించి తారా కనక సేనుల నిటకు బట్టి తెమ్మని వారల బాధలం పెట్టెదా అటులైన నేజెప్పి నట్లు వినగలదు (అని వీరశూరులంజూచి) వోరే వీరశూరులా తారా కనకసేనుల నిటకీడ్చుకొని రండు వేగంబున బొండు.

అంత వీరశూరులు

వ॥ మీరాజ్ఞాపించిన విధంబె తార కనకసేనుల నిచ్చటికియీడ్చు కొని వచ్చెదము యిదో పోవుచున్నారము.

విమ-వ॥ (తనలో అయ్యో అని రొమ్ము జరుచుకొని) తనయులారా యీ క్రూరుడు మిమ్మెంత బాధ పెట్టునోకదా నాకండ్లతో జూచుచు నేనెట్లతరింతును (అని దుఃఖించుచుండ క్రూరసేనుడు)

వ॥ వోసి మూర్ఖురాలా నీసమ్మంధ ప్రలాపములకేను వెరచువాడ నని తలంచితివేమొ కాబోలు యిక నోరుమూయుము.

క్రూ॥ యెంతో నీకు విహితంబు దెలిపినన్ - కాసంతనయిన బుద్ధి రాదాయెన్ ॥యెం॥ యింతనా ప్రాతాపమున్ - గాంతుపీక్షణంబునన్ పంతము లాడెదవా ॥యెం॥

గీ॥ నీదుబిడ్డల జంపియు నీవుజూడ ♦ మేకలనుగోసి దుర్గకు మేత నిడిన ♦ చందమున కనకతారల జంపినీకు ♦ దుఃఖముఁగూర్తు చూడు మో ధూర్త వినవే॥

వ॥ కావున నీబిడ్డలంబట్టి నీముంగిటనే కంఠంబున్ తెగవైచెదను అప్పటికి నీకు బుద్ధివచ్చి నేజెప్పినట్లు మెలంగెదవు కాబట్టి సంగీతమునకు చింతకాయలు రాలవన్నట్లు నావిహితోపదేశమునకు నీవు వినుదానవా మంచిది యింక జూచెదను.

విమ-వ॥ (తనలో) హా చిరుతలారా యీవిధాత మీనొదుట యిట్లు వ్రాసియుండెనా అయ్యో యిక మనకెవ్వరుదిక్కు దీనికుపాయం బేమిగలదు యెన్ని సంకటంబులొచ్చినను పతివ్రతాధర్మంబు దప్పరాదు గదా నాకా శ్రీహరియె కలడు (ప్రకాశముగా) అయ్యో!

వ॥ వరే వీరశూరులారా నాయాజ్ఞయుఁ దప్పక నిప్పుడే యీ కనకతారలం గొనిపోయి కారడవి మధ్యంబున తలలు ద్రెంచి వైచి రండు యిప్పుడే పొండు అట్లు జేయకున్న మిమ్ముల నంతకునింపోలుకంపించెదను పొండు.

వీ-శూ వ॥ నరేంద్రా మీరనువిధంబు జేయువారము యిదేమేముం బోవుచున్నవారము. (అని కనకతారలం బట్టుక పోవుచుండగా విమలా దేవి దుఃఖించుచు తనలో)

వ॥ హా చిరుతలారా యిక నేనేమిచేయుదును యికమీకు నేటితో ఆయుష్యం మూడెనా (అని మూర్ఛిల్లిన లేవనెత్తి)

క్రూ-వ॥ హేపాపిష్టురాలా యింతటితో నిన్ను విడచువాడ నను కొంటివా యేమీ నీబాలుల తలలు ఖండింప నరణ్యంబునకు బంపినది నీవుఁ జూచియే యుందువుగదా యిక నీకెవరుదిక్కు.

(అనిన విమలాదేవి భగవంతునుద్దేశించి)

వి॥ ధరణిశ్రీచోలమద్ది పురివల్లభా - పురివల్లభా ,ధ॥ కరుణాకర మీచరణ యుగంబులు - స్మరియింతుమముఁ దరిజేర్చుమికఁ ॥ధ॥

సీ॥ మోహినిరూపివై మోహంబుగల్పించి ♦ యమృతంబొసంగినా యట్టినీవు ♦ పద్మాక్షి సీతను బట్టురావణుగూల్చి ♦ భువికీర్తిగాంచినా పుణ్యుడావు ♦ సకల రాక్షసులను సమయించి జగమందు ♦ ప్రఖ్యాతి గాంచినా పతివినీవు ♦ రాతిని స్త్రీజేసి ఖ్యాతిగడించియు ♦ గుహునికి ముదమును గూర్చితీవు। గీ॥ అట్టిలీలలు యెన్న నెవ్వారితరము ♦ నాథ శ్రీనాథ భూనాథ నాథనాథ ♦ సాధుపాలిటి దేవయో సరసిజాక్ష ♦ దీన జనరక్ష పొందు ప్రసూనరక్ష॥

వ॥ హేజగద్రక్షకా నాభర్తను జంపినదేగాక నాప్రియసూను లను గూడ యీదురాత్ముడు ఖండింపందోలించె శ్రీహరీ యికనే బ్రతికి యుండి కాల్పనా యొక్క క్షణంబైన నిలచి యుండజాలను యీసము ద్రంబులోబడి ప్రాణంబులు విడి చెదగాక.

(అని సముద్రంబులో బడినంత కర్వారసేనుడు)

వ॥ ఛీ పాపిష్టురాల నేటితో నాపీడ వదలినది పొమ్ము.

అని క్రూరసేనుడు వెళ్ళినా అరణ్యములో కనకతారలువీరశూరులు.

కనక తారలు అనుబంధము అది.

కనక-తా॥ శ్రీనాథా సింధుశయనా - గానలోలా - మముగావ రేలా ॥శ్రీ॥ దీనజనావనా - దేవదేవకడు - దీనులమగుమము కడతేర్పు ము॥శ్రీ॥ ౧॥ తల్లివి దండ్రివి-దైవమునీవనియుల్లమునమ్మికో నున్నమయ్యా॥ శ్రీ॥ ౨॥ మాపినతండ్రియు మాపైయింతయు - పాపమనక నీపగిదిజేసె॥ శ్రీ॥౩॥ యేపాపము మేమెరుగనివారము - తాపసనుత మముదయనేలుము॥ శ్రీ॥౪॥ జెనని జనకులాకును నోచనిమా - పనువులు గాపాడ వలయు ను॥శ్రీ॥౫॥ చాలమద్ది జలజాక్ష పరాత్పర - నీలవర్ణకమ లాలయ నుత ॥శ్రీ॥౬॥

వ॥ సర్వేశ్వరా దీనులమగు మాకెట్టి యీకష్టము లొనరించితివి అయ్యో క్రూరసేనా నీవు మాపినతండ్రివై యింత గాసిపుచ్చ దలంచి తివా తండ్రీ.

సీ॥ పినతండ్రివై నీవు గనరావు మమ్మల ♦ జంపగన్యాయమీ జగతిగలదె ♦ పాపపుణ్యంబులే లోపంబెరుంగము♦ మమ్మలజ్ చెండాడ మనసుబడెనా ♦ మీయెడ దోషంబు మేమేమి జేసితీ ♦ మయ్య విను మయ్య మాకయ్యలివుడు ♦ క్రూరుండవై నీవుకుచ్చితంబులబూని ♦మము నిట్ల జేయనీ మదిచుదంబె॥ గీ॥ వైరి అయినను శరణన్న వదులునుందు ♦ రట్టెద్రోవంగరాదె రానట్టడవిని ♦ కమలగర్భుండు మాకిట్లు కఠినుడయ్యి వ్రాసెగాబోలు యింకమా ప్రాప్తమేమొ॥

వ॥ శ్రీహరీ యిట్టి ఘోరారణ్యంబున నీవుందప్ప మాకుదిక్కె వ్వరు నిర్దయుండవయ్యి మాపినతండ్రి మమ్మిట్లుంజేయ న్యాయమా వో యనాథరక్షక నీకిసుమంతయిన మాయెడ దయరాదా దీనులపాలిటిదైవం బగు నీవెందుబోయితివి హా జగదీశ్వరా రక్షించుము.

వీ-శూ-వ॥ చాలుచాలుమీ సంభాషణలు యిక కాలము గడుపు చుంటి రెందులకు వరే వింటిరా వీరి వేదాంతములు పిట్ట చిన్నది కూత పెద్దది యనునట్లున్నది. యింక చూచెద వెందుకు యిప్పుడే వీరి కంఠం బులజ్ నరికివైచి వెళ్ళవలయునుగదా (అని కనకసేనుంబట్టి యనుట)

వ॥ ఒరే బాలకా మొదలైతె నీకంఠంబుజ్‌బట్టి తెగవైచి పిదప నీభగిని తల ద్రెంచెదను యిక నీవి భూమినంబడుము.

(అని కనకసేనుని క్రిందబడవైచిన తార తమ్మునిపైబడి)

వ॥ హా తమ్ముడా కనకసేనా మనకెట్టి కష్టములు సంప్రాప్తమాయెనురా తండ్రి.

తార-కనక॥ డైలాగ్ (యేమిసేతామిక భీమయ్యా)

తా॥ కనకసేనా మనగతియేమిరయికా - ఘనులు యెవరు మనలను రక్షింపన్ - జనని జనకులకు నోచని దుర్దశ - గోనిననునకు చేకూరునె మనకున్ - చేకూరునె సుఖమున్ ॥కనక॥

చ॥ మనపినతండ్రియిట్లుదయ ♦ మాలివనంబులో జంపబంపెనిం
దునగను వారులేరుకదు ♦ దుర్బలమయ్యెను నాశరీరమం
దనయము బాధ పెట్టియును ♦ దారలు లేరొకో నీక్షితిన్ మనన్
గనుగొనువారులేరుదరి ♦ గానము బాధెటు దప్పనోయిటన్॥

వ॥ అయ్యో తమ్ముడా మెత్తని పాన్పులందు శయనించు నీశరీరము పలుగురాళ్ళలో బొరులుచుండెను గదా హా తమ్మా యిక నేనెట్లు తరింతునురా.

కనక॥ భగినినీవు యీపగిది యేడ్వగనూ - బుగులుందోచెనుభూరిగ యిపుడున్ ॥భ॥ అగణిత వైభవులము మనకింతటి - తగనికష్టములు దాపురమాయెన్ ॥భ॥

గీ॥ చావగానున్న జనని యెచ్చటికిబోయె ♦ జచ్చెజనకుడు మును మున్నె జావకునికి ♦ బ్రతికినారము దైవంబె బాలుపడినా ♦ నీచజన్ముల నెవరుద్ధరింతురకటా॥

వ॥ కావున భగినీ మనకా బ్రహ్మదేవుండు నాయుష్యంబింతటికే వ్రాసియుండబోలు లేకున్న యిట్లగుట కేమికారణం అట్లు గాకున్నం దులకు మనమిట్లు దుఃఖించ నేమి లాభము కాగలకార్యములుకాకతీరునా.

తా॥ ముందటి జన్మమునందున నీతరీ - యెందరీ ప్రాణములుం దీసితిమొ ॥ముం॥ అందుకె మనకీ యాపదలన్నియు - జెందుచుండెయిక జచ్చుమను దేమో ॥ముందటి॥

వ॥ కావున తమ్ముడా పూర్వజన్మంబునం జేయు కర్మంబు లెవరు దప్పింతురు యెంతటి మహాత్ములకైన ననుభవింపక తీరదు యందులకయి మనముం దైవమ్ముందూరిన నేమిఫలము తమ్మా.

కనక॥ సారసాక్షుడగు చాలమద్దిహారి - నీరీతిని స్మరియించినమన మున్ - కారుణ్యము రాక యుండెనుమన- మేరీతిని దరిజేరగలము॥సా॥

వ॥ అయ్యో దైవమే లేడు అతడే యున్నయెడల మనకీలాటి బాధలుం గలుగును ఆకా- మనమిట్లు దుఃఖింపుచున్న మన నాదరించు వారెవరు యీ యాపద సముద్రమునుండి దాటగలమా దైవబిధి దప్పించనెవరితరము.

తా-వ॥ తమ్ముడా చావనునది ప్రతిమానవునకువిధింపబడియున్నది గాన దాని ప్రమాణంబు దెల్పలేక పోవుటచే యించుక దైర్యంబుండదు గదా. మనకైన నట్టులనే మృత్యువు సమీపించి యుండబోలునుగదా.

శూ-వ॥ అబ్బా. వీరి వేదాంతోపన్యాసము యింక ముగియకున్నదే వేయిరాత్రులు వేయు పగలైన నిట్టులే జెప్పుకొనుచుందురు వరే వీరా యింక జూచెద వెందుకు నీవిటు రమ్మి వీరిరువురిని కదలకుండ ఘట్టిగా పట్టుకొనుము. యొకదెబ్బకె వీరి రెండుతలలుం క్రిందబడునట్లు యీ గొడ్డంటుం నరికెదను.

కన-తార-వ॥ హా సర్వేశ్వరా యికమాగతియేమి.

(అని మూర్ఛిల్లినంజూచి వీరుడు శూరునితో యిట్లనియె)

వ॥ వరే నీవెంత కఠినుండవుర రాళ్ళుగరుగునట్లు యేడ్చెడు పసి కూనలం జంపుటకెట్లు నీచేతులు వచ్చునురా.

శూ-వ॥ సరెసరె మీమాటలకేమిలే వీరినిచ్చటం జంపకున్నను మననచట క్రూరసేనుండు బ్రతుకనిచ్చునా.

## ద్విపద ? 

వీర॥ వినర శూర నీకునొకటి - విన్నవింతువినుమికా॥విన॥ మనకు వీరినిట్లువధ్యించ మరియాదయు గాదికా ॥విన॥

వ॥ వారే తన ప్రాణముల గోల్పోయినను పరులకాని యితరుల ప్రాణములు రక్షించుట సజ్జన లక్షణమని యెరుంగవా యిదియుంగాక జీవహింస జేయుట మహానరకంబు సిద్ధించును వింటివా.

శూ॥ యిందుకు నాలోచన - నీవేమి జేయుచుంటివీ - పొందుగ నిట్లొనరించిన భూరిపాపమంటివీ ॥యి॥

వ॥ అబ్బా అంతయోపిక నావద్ద లేనేలేదు నీవు యోపిక గలవాడవై వీరలను విడచిపెట్టి పోదామని యందువేమొకాని మన యజమాని మాట జవదాట రాదుగదా.

వీరు॥ యెవరికైన ప్రాణభీతి - యెక్కువగానుండును - సకినయముగ నందరితన సమముజూడ వలయునూ ॥యె॥

వ॥ నీప్రాణములమీదితీపి నీకెట్లుయుండునో సకల ప్రాణుల కట్లనే యుండునుగదా యీపసిబాలులకింక యెట్లుండునో నీవే యోచించుకొనుము మన యజమానిమాట జవదాటనందున వచ్చునదేమీ యీపసికూనలరక్షించి మనము పుణ్యము సంపాదించకొనవలయు వింటివా.

శూ॥ ధారుణిశ్రీ చాలమద్ది - ధాముడె రక్షించును - ఆరూఢిగనీవుదెల్పు యాజ్ఞయునేమీరనూ॥ ధారు॥

వ॥ (తనలో) యితండు మహా నేర్పరుడు యిదియుంగాక మిక్కిలి పరాక్రమశాలి యితనిమాట వినకున్న యెప్పటికైన ముప్పు వాటిల్లక తప్పదు కావున యితని యిష్టప్రకారమే మెసులవలయును (ప్రకాశముగా)అన్నా అటులైనను యీవిషయమయ్యా సర్వభారం నీదేకాని నాదేమిలేదు నీవెట్లు జెప్పిన నట్లువినగలను వింటివా.

వీరు-వ॥ మంచిది నీకెంతమాత్రం నేనుండగా భయంబులేదు నమ్ముమము. (అని మూర్ఛనొందియున్న కనకతారలలేపి)

వ॥ నాయిన్న మిమ్ములం జంపుటకు మామనస్సొప్పకున్నది మిమ్మిచ్చటనే విడిచి పోయెదముగాని మీరు మీపినతండ్రిగారికి కనబడకుండ చాలదూరము వెల్లిపోవలయునుగదా.

కన-వ॥ ఆహా పుణ్యాత్మ మీరుమాయందు కరుణబూని మన్నింపదలచితిరా సరీ మీరుందెల్పునటులే యెందులకైన గానరాకుండ వెళ్ళిపోయి బ్రతికెదము తండ్రీ.

వీరు-వ॥ మంచిది మేముపెళ్ళుచున్నారము (అని పెళ్ళుదురు తార కనకసేనుంగని)

తా-వ॥ కనకసేనా చూచితివా భగవంతునిమాయ యెంతలోనే మారినది ఆహా జగన్నాటక సూత్రధారియగు నాదివ్యపురుషుని లీలలు గనుగొన నాబ్రహ్మకైన తరమా సరి తమ్ముడయ్యా యిపుడుగదా మన ప్రాణములు దక్కినవిగాని.

గీ॥ నీరములు దెమ్ము సోదరా నిలువలేను ♦ ప్రాణములు బోవ సిద్ధమై ప్రాణియుడిగె ♦ దాహమగుచుండె క్షణమైనతాళజాల ♦ కనులు చీకట్లు గ్రమ్మెను కానరాదు॥

వ॥ కావున సోదరా నాలుక యెండి లోనికి యీడ్చుకొని పోవు చున్నది శీఘ్రంబుగ జలంబులు దెచ్చియిచ్చిన బ్రతుకుదును లేకున్నను బ్రతుకలేనుగద.

కన-వ॥ అక్కటా యీ భీకర కాంతారంబున నెట్లు జలంబులు సంపాదించగలను యిచ్చోట దొరుకునట్లు గాన్పించదు యేదైన నొక గ్రామంబు జేరబోయిన నీరములు దొరుకగలవు మెల్లమెల్లన బోగలముఅక్కా.

తార-వ॥ తమ్మా అటులైన పోవుదము పదము (అని తనతల్లిని) దలంచి హా జననీ పసిపాపలమగు మమ్ముల విడనాడి యెందుబోయితివి మాకష్టంబులు యెవరికి ముద్దు తల్లీ.

డైలాగ్ - యేకతాళం

తార॥ అమ్మా యెటుబోయితివే - మమ్మాల గనరావే ॥ అ ॥ అమ్మాయిలలోమనలీ దైవమ్మెడ బాపెనయ్యోయ్యో ॥అమ్మా॥

గీ॥ తల్లిప్రాణంబు విడనెంచి దారుణమగు ♦ వనధి గూలంగ బోయితె మరియువంగా - వింటి తల్లి యటంచు మేమొంటినెవరి ♦ బిలుతు వో యమ్మ మాకు లభింతువే మొ।

వ॥ అమ్మా నీవానాడు క్రూరునిచే జిక్కుంబడి కష్టముల బడు చుండ మమ్ముగని విలపించితివి గదా నీకష్టములే నీకు గలిగుండ మా కష్టములు గూడ చూచి సహింపక పోయితివి బిడ్డల ముండియు నిన్ను రక్షింప కుంటిమి మావలన నీకు మరింత దుఃఖము గలిగెనుగద తల్లి.

కనక॥ తల్లీ నిన్నెడబాపెనూ - దైవమీనాటికి ॥తల్లీ॥ మళ్ళయు కండ్లకు మరియు గానరావేమో ॥తల్లీ।

గీ॥ పౌరుషములేని బ్రతుకొక్క బ్రతుకుయగునె♦ యేనుజన్మించు లాభంబదేమిగలిగె ♦ నమ్మ గాపాడ లేకనే ద్రెమ్మరిలుచు♦ నుండలాభం బదేమి నేనుండిజగతి॥

వ॥ అమ్మా నీకడుపున యేను మొగబిడ్డనై పుట్టి నీకష్టములుదీర్చ లేక పోతినిగద నాది వృథా జన్మముగద తల్లీ.

తా॥ తమ్మి యికేమిసేతూ - దాహంబు కోర్వలేనూ ॥ తమ్మి ॥ సుమ్మినడువజాలా - దేహమ్మి - పరవశమయ్యెను ॥తమ్మి॥

వ॥ సోదరా యికనేనేమి సేయుదును కన్నులకు చీకట్లు గ్రమ్మి చున్నవి విస్మృతి దప్పుచున్నది యిక నెట్టులైనను గాపాడుకొనుము.

(అని మూర్ఛిల్లిన కనకసేనుడు)

వ॥ అహా దైవమా యిక నేనేమిసేయుదును మద్భగిని మిక్కిలి దాహంబుగొని మూర్ఛాగతురాలయ్యెనుగదా.

కన॥ ధారుణిశ్రీ చాలమద్ది - నారాయణాచ్యుత - కారుణ్య మునమమ్మి గావవ దేవార్చితా ॥ధా॥

వ॥ శ్రీహరీ మాయెడ కృపదలంచి జలంబులం గాన్పింపజేయుము.

(అని జలంబులకై వెళ్లును)

—♦ దొంగ ప్రవేశం - అనుబంధము ♦—

దొం॥ దొంగతనమె చెయ్యాలె - దొరపేరుతేవాలే - అంగైన యిండ్లల్లో బంగారం దొయ్యాలే ॥దొ॥ దొంగోల్లకందరికి దొరనయ్యి యున్నాను - యింగిత మెరంగివనిసింగారుడయ్యెను ॥దొం॥ అందరికన్న యెక్వ అదురుట్ట మంతున్ని - యెందైన నావోలె యెవరు సీమంతున్ని ॥ దొం॥ మేటి చాలమద్దీ - హాటకంభారూని - మాటికిదల్తునా నోటిబత్తి లోని ॥దొం॥

వ॥ యీాయేల్ల కాలికమ్మ దగ్గిరికెల్లి నేనెక్కడికెల్లినా జయం గావాలని మొక్కేను మొక్కంగనే నాకాదేయి పత్తెచ్చుమయ్యేయేమం టాది నాకు కన్నెభలేత్తె నీకు మేలు జెత్తనన్నది నేను యెంత యెదికిన పిల్ల సిక్కిందికాదు తిర్గితిర్గి సూత్తవున్న అది దొర్కుతాదాలేదో నాకో రిక సఫలంబౌతాదోలేదో తల్లికటాచ్చం బెల్లున్నదో అని యెల్తా మం చిది యింకా యెతికి యెతికి కన్నెపడుచును తీసుకోచ్చి యాకాలమ్మకు భలిత్త గాక.

(అని వెళ్ళును అంతట తారలేచి)

వ॥ సోదరా కనకసేనా నాదాహము తీర్చుటకై నీరములు దెచ్చి తివా లేదా (అని అటుయిటు జూచి తమ్ముడు లేనందున)

వ॥ తమ్ముడా తమ్ముడా ఆయ్యొ యెక్కడను లేడయ్యె యికనేనేమి సేయుదు హా శ్రీహరీ తల్లిదండ్రి నెడబాపినదిగాకను మమ్ములగూడ

బాపితివా హా కనకా దేహము దెలియక దాహముగొని పడియున్న నన్ను విడనాడిపోవ నీకు యెట్లు కాళ్ళాడేను.

(తార అనుబంధము)

తా॥ యెటుబోయితివిరా - నన్నొంటరిగనువిడనాడి - కటకట నాయందునింత - కఠినము దలపోసితివా - యెటుబోదు నారణ్యములో నెవ్వరాదుకొనంగలరు ॥యెటు॥

చ॥ యెటు జనినాడవీపునిను ♦ యెవ్వరెరుంగగ జాలువారునా
పటుతరమైన బెబ్బులులు ♦ బాపురె యీయడ వందుగల్గునీ
వెటుల చరింపగాగలవు ♦ యెవ్వరుదిక్కిట నాకునింకయీ
యటవిని దిక్కదేదిక ♦ రయంబున రాగద పోయితమ్ముడా॥

తా॥ యేరీ నీసాటి - బలుకారుణ్యము గలవారిల ॥యే॥ ధారుణి శ్రీచాలమద్ది దాశరథికి నింతైనను కూరిమి రాదాయెనిన్ను యీరీతిని బాపెనహా॥

వ॥ ఆహా నేనెంత తెలివిలేనిదానను దాహము దాహమని పలుమారు కలువరించి మతిదప్పి భూమిపై యింబడగాజూచి నీరుదెచ్చుటకై పోయి యుండవచ్చును అట్లుగాకున్న నన్నేల విడిపోవును మంచిది జలంబులు గొనిరాగలడు కొంతవరకు తాళియుండెదను కానిమ్ము.

(అంతలో దొంగవచ్చి తనలో)

వ॥ యిదొల్లోకాని యిక్కడొక్కతె కూకుండి తమ్ముడాతమ్ముడా అని యేడుత్తున్నదే దీనికి తమ్ముడోడుగావచ్చును కొంచము దగ్గరకెల్లి మాట్లాడిత్తగాక (అని వెంటనే) పిల్లా వోశిల్లా మీరోల్లే నాకు జెప్పరా చెప్పాగద్దా.

(తార దిగ్గునలేచి తనలో) దొంగనుజూచి భీతితో

వ॥ యేమీ వీనిరూపంబు జూచినను నామది భీతిగలుగుచున్నదే వీడెవండో కాబోలు యీయడవిలో నివసించు దొంగవాడుగానున్నట్లున్నది శ్రీహరీ వీడు నాకేమి కీడు చేయునోకదా.

ఝైలాగ్

దొ॥ వోల్లెపిల్లానీవు వూకేయేడుత్తున్నావు - కల్లొలాడాక నాకదెంటోశెప్పు - తల్లిపేరేమో నీతండ్రిపేరేమో - నాయుల్లామురంజిల్ల తెల్లముగబల్కు ॥వో॥

వ॥ పిల్లో వో పిల్లా మాటాడ వేం నీయయ్య పేరేమి నీఅవ్వ పేరేమో యింక తమ్ముడాయని యేతత్తున్నావు అని పేరేమి నాకయిన జెప్పు యింటా. (తార తనలో)

వ॥ వీనితో నాయదార్థవు వృత్తాంతంబు నంతయు దెల్పితినా మేలు జేయవచ్చునేమొ తెలిపెద.

తా॥ యేమనితెల్పుదును - నా శ్రమ టుక్ ॥యే॥ శ్రీమంతుడుదయ సేనుని పుత్రిని - నామముతారా - యనిపిలుతురునే ॥యే॥

వ॥ అయ్యా మాతండ్రి వుదయసేన భూపాలుండు నాతల్లివిమలా దేవి నాతమ్ముడు కనకసేనుండు నాపేరు తారాయని పిలుతురు నాయిన.

దొం॥ భేష్ భేష్ నీవు రూపగోడగు దొరోరి బిడ్డవేనా నేనెట్లో యని యనుకున్నాను.

దొ॥ వారెవా నాకు సంభారమనిపిచ్చె ॥వా॥ కూరిమినీ వెందు కోసామిట్లా జేరంగవత్తివో - జెప్పావె నాకదంతా - భూరింగనేజేయు పుణ్యం ఫలియించెను ॥వా॥

వ॥ మరి నీవొక్కదానవు యిక్కడెందు కెట్లొచ్చావో యేది చెప్పు.

తా॥ నిక్కముగను యేనూ - నుడివెదనూ ॥ని॥ చక్కని శ్రీకర చాలమద్దీమరి - మక్కువతోనను మన్నించుమనుమీ॥

వ॥ మాపినతండ్రియగు క్రూరసేనుడు మంత్రిని సేనాధిపతినిన్ జంపి మాతండ్రిగారినిగూడ హతంబొనరించి మమ్ముల నీయడవిలో జంపుమని యిద్దరిభటులనిచ్చి పంపగా వారుమామీద దయగలవారై యిక్కడ విడచి పోయిరి అంతట నాకుమిక్కిలి దాహమగుచుండగా నాతమ్ముడైన కనకసేనుడు నీరములు దెచ్చుటకై జనియెను నీకుం గనబడియున్న దేమో తెల్పుము.

దొం-వ॥ పిల్ల నాకదంతయు తెలిసిందిగాని నేనొక మాటజెప్తా యిటువిను అదియేమంటె నేను కాలికమ్మకు కన్నెపడుచును బలిత్తానని మొక్కినందుకు కాలికమ్మ కటాచ్చం వలన నీవు నాకు దొరికితివి యిక నిన్ను కాలికమ్మకు బలియిత్తాను నడువుము పిల్లా,

(అనిన తారా గడగడ వడంకుచు తనలో)

వ॥ హా సోదరా కనకసేనా యెందుబోయితివి తమ్ముడా,

(అని మూర్ఛిల్లినా తారను దొంగ యెత్తుకొని పోవును)

—♦ జయసింహమ్మహుడు ప్రవేశం - అనుబంధము ♦—

జయసింహమ్మహుడనె - జనపాలుడా-నయమానసుడ విజయమొందిన ఘనా ॥య॥ భయరహితుడ దోర్బలుడ వైరులను - క్షయమొందించిన క్షత్రియుడనునే ॥జయ॥ సారాచారుడా - సద్గుణుడా మారసుందరా శారుడ శూరుడ - ధారుణిశ్రీకర చాలమద్దినగ - ధీరమాధవుని కూరిమి నెంచెటి ॥జయ॥

వ॥ సుబుద్ధి సద్గుణైశ్వర్య ప్రసిద్ధి.

సూ-వ॥ జయసింహా మహీపాలా యేమియాజ్ఞ.

## దైలాగు

జ॥ కుశలమా మనరాజ్యంబునగల - సర్వజనంబులకున్ ॥కు॥ నిశి చరాళి వలనగల్గుభీతియు - నేమి లేకదానధర్మపరులై - నిసిచిరాదినెంతో భక్తినెంచుచు - నిత్యతిభవ మనుభవింపుచునుబల్ ॥కు॥

వ॥ నేబల్కునట్లు సర్వజనంబులు సుఖోపాయులయ్యేయున్నవారు గదా తెల్పుము.

సు॥ నరవరా - తమరెండనెట్టి కొరతగల్గు జనములకున్ ॥నర॥ ధరణి చాలమద్ది వాసుడగు శ్రీహరి మనమునందు భక్తి నెంచుచు - నిరతమెంతో సకల సౌఖ్యపరులై - సురుముదంబు నొందియున్నవారలు॥

వ॥ నరేంద్రా మనరాజ్యంబునా సకల జనంబులు సుఖోపాయులయ్యే యున్నవారుగాని యొకవార్త వింటిని యేమన.

గీ॥ క్రూరభావంబు నెంచియూకచ్చితుండు♦ అన్నటజంపి ప్రజలను యున్నొగతుల ♦ నేడిపించెడు దానికై నెవరుదిక్కు ♦ లేకనున్నారు క్రూరుని బోకడంపా॥

వ॥ మహాదురాత్ముడైన యూక్రూరసేనుండు పాపంబని యెంచంక నిష్కారణముగా తన అగ్రజుండగు సుదయసేనుని సంహరించెనని వింటిని యిదియు నిజమేన

జయ-వ॥ అవును యీమాట నిజమే యీ క్రూరసేనుండు మహా దుండగములొనరించుచున్నాడు యింతా నెటులన్నను.

సీ॥ తనకన్న యవునంచు మనమందునెంచక ♦ నన్నను జంపెడు యాధముడున్నె ♦ మాతసమానియా మానిని వదినెను ♦ బట్టనెంచిన

యట్టి పాపియున్నె ♦ పతియాజ్ఞనుగొంచు పాపంబు లేకుండ ♦ రాజ్య మేలెడుమంత్రిపూజ్యుఁజంపె ♦ పసిబాలలంచును పాపంబనెంచక ♦ శిశు హత్యలంజేయు చెనటిగలడె॥ గీ॥ అట్టి యధముని వెనుకాడి యనవరతము జీల్చికాయంబు ముక్కలు చేసి పిదప ♦ కారమంటింప పాపంబు గలుగ కెందు ♦ జగతినీమాట నిక్కంబు వగవనేలా॥

వ॥ సుబుద్ధీ వింటివా మహాసాధ్వీ సిరోమణియగు విమలాదేవి కెట్టి విపత్తు వాటిల్లెను యీ వృత్తాంతము నంతయు మున్నె వసంతుడు తెల్పియున్నవాడు కావున మనమిపుడె యుద్ధసన్నద్ధులమై వెడలి యీ క్రూరసేనుని బరిమార్చి యుదయసేనుని భార్యపుత్రుల బాధమాన్పి వత్తము లెమ్మని.

సూ-వ॥ ఆహా నరేంద్రా మీపరోపకారంబున కేనుమెచ్చితిని సరి ఆటులే పోదాము పదండు. (అని వెళ్ళుదురు)

(అంత దొంగవాడు తారను బట్టుకొని కాళికాలయంబునకు బోవు చుండ తార శ్రీహరిని దలంచుచు దుఃఖించుట)

అనుబంధము

తా॥ రారనన్రోవా - శ్రీరమణీశా ॥రా॥ క్రూరుడయినట్టి యీ చోరుండు ననుబట్టి - జేరుచున్నడు కాళికిని యాహారంబుగా బలి యిచ్చు నటయిటు ॥రారా॥

వ॥ హా సర్వేశ్వరా యికనాకెవరుదిక్కు కృపబూని నన్నురక్షిం చుకొనుము జగద్రక్షకా అనిన.

దొం-వ॥ అమ్మోరుదయవలన యీకన్నెపడుచు నాకు చిక్కింది గాని యియ్యాల్ల శుక్రవారముందిగానమాయమ్మోరుకు దీన్నిబలియిత్తం. అబ్బాయిదే మేడుత్తాది యేమెడుత్తాది వూకోయె వూకోయె చెవులు కడిగెలు బడుత్తు యీనాడేమొ నిలబడితివి.

(అని తారను గుంజుకపోతుండ జయసింహుడు సుబుద్ధినిగని)

జ-వ॥ సుబుద్ధి చూచితివే యెవండో చోరుండు యొక కన్యను కాళికాదేవికి బలియివ్వబూని పట్టుకొని పోవుచున్నాడు అదె ఆబ్బాలిక రోదనంబు వినబడుచున్నది. అచ్చోటికింబోయి యబ్బాలికను విడిపిం తము రమ్మని.

సు-వ॥ రాజేంద్రా అయ్యో యెంతకార్యము అట్టి దిక్కులేనివారి ప్రాణంబులు రక్షించుట యెంతపుణ్యము పదుము.

తారా - దర్వు

దీనాజనపాలా - సుగుణాని లోలా ॥దీ॥ యేనుజేసిన నేరమేమీ - నాయెడకరుణా - బూని యిటకే తెంచియును - మత్ప్రాణములు - రక్షించు మ్రొక్కెదా ॥దీ॥

వ॥ అహా శ్రీహరీ యిట్టిదుర్మార్గుని బారినుండి నన్ను దప్పించెటి వారెవ్వరు హా తమ్ముడా కనకసేనా.

గీ॥ జలములును దెత్తు ననిపోయి చాలనిట్టి ♦ గహనమున నెంత వాపోయిగాసినొంది ♦ నాడోతమ్ముడయ్యోనొంటినై తినకట ♦ బ్రతికి యుంటినా జీవముల్ బాపితీవో॥

వ॥ తమ్ముడా మనమిద్దరము పిన్ననాటనుండి యొక్కనిమిషంబైన నెడబాసి యున్నవారము గాముగదా నేడు మన కెడబాటు గలిగి యుండెనుగదా సోదరా.

దొం-వ॥ (తనలో)యేమ యేమ యేడు నీయేడుపులన్ని యనుగు తావి యేమో తమ్ముడాయని యేడుత్తున్నావు మాకాళికమ్మోరు దగ్గిర మీతమ్మన్ని జూపిత రమ్ము బేగినడు.

(అని తారను గుంజుకొని పోవుచుండ జయసింహుడు ధ్వనివిని)

జ-వ॥ సుబుద్ధి వారలు యింక మనకు చాల దూరముగ నున్న వారు సరసర నడచిపోవుదము రమ్ము (అని పరువిడుదురు)

తా॥ యేరీగతినాకు - యింకెవరుదిక్కు ॥యే॥ మారజనక చాల మద్ది పొరినివాసా - వారిజాక్ష ముకుందాభక్తుల - పాలిదైవంబీవెకదా యిక ॥యే॥3॥

వ॥ అహా శ్రీహరీ యికనా శరీరము చాలించవలసి వచ్చినదేమో కాబోలు మంచిది కానిమ్ము యెట్టి యిక్కట్టు లొదవినను నీనామస్మరణ మరువను.

దొం-వ॥ మాకాళికమ్మోరు ఆకలిగొందె యికభేగిశడేయిప్పుడే నీకు తానమాడిచ్చి పసుపుపూత్తా పూలపేర్లెత్తయేసి కాళికమ్మకు నిన్ను బలిఇత్తా నడువుము.

(అని పోవుచుండ జయసింహుడు)

జ-వ॥ సుబుద్ధి యీ చోరుండు కాళికాలయంబు జొచ్చియున్న వాడు మనము మరుగుననుండి వాని సంహరించవలెను వింటివా.

సు-వ॥ దేవా అటులనే గావించెదము రండు. (అని వెళ్ళుదురు)

(అంత చోరుండు కాళికాదేవి గుడికివచ్చి తారను నిల్వంబెట్టి)

దొం-వ॥ పిల్లానీవీ కాళికమ్మోరునుచూచితివా యిక నీయమ్మోర్కు దండాల్ బెట్టు (తార పలుకకున్న) యేం మాటాడవా యింగో నాచేతుల్లో యేమున్నదో చూశావా యింగో.

(అనిన తారా వడవడ వడంకుచు)

డైలాగ్ - అన్నను మన్నింపుమా వరుసా.

తా॥ అన్న నీకిదితగునటే - నన్నుతింపనను - సంహరించవటే ॥అ॥ నన్నుగొట్టబూని యున్నఫలమే - మున్నది నీకిలలోనా - నీకన్నబిడ్డవలె గానా - నాకన్నతండ్రివని - యెన్నుచుంటిమది ॥అన్న॥

వ॥ అన్నయ్యా నిష్కారణముగా నన్ను గొట్టిన నీకేమిలాభము గలుగును అబలల జంపుట ధర్మమేనా మహాత్మా యేను శ్వానముతరి కావలిగా నుందును జన్మాంతరము బానిసనై మెలంగెదను నన్ను కన్నబిడ్డవలె నెంచి కరుణించి నాప్రాణములు తియ్యకుము యిదే నీకాళ్ళకు మ్రొక్కెద. (అని కాళ్ళపైబడును దొంగ కాలితో తన్నును.)

దొం-వ॥ ఒసే నాకు మొక్కితే నీకేమి లాభంలేదు యీకాలికమ్మోర్కు మొక్కుము మోచ్చానికి బోతావు మొక్కవే.

(అని సిగబట్టి వంచి - దొంగ దన్న)

దొం॥ నీవెంత యెడ్చిన నేవినువాడనా-యేను యినేవాడనా నీకు దెలియదేమానా - యేవిధైన కాలికమ్మ దేవికి బలిత్తునిన్ను॥

వ॥ యేమీ నీకు నేనన్నగాన్నా నీవు మానాయన్నకు బుట్టినావు కుక్కలెనాయింటికాడ కావలుంటవంటవుగాని జంగల్లోదిరిగె దొంగోల్ల మగు మాగు ఇల్లెక్కడిది యింటె ఇక ఆమ్మోర్కు మొక్కు యీకత్తితో నీగొంతు కొట్టెత్తా.

తా-వ॥ (తనలో) అహా అక్కటా నన్నీ జగజ్జనని కాహోరార్థమై నన్నావిధాత సృజించి యున్నవాడేమొ కాబోలు హేమాతా లోకైకప్రభూతా.

తా॥ అంబ జగదంబానను - ఆదుకొనుము నిన్ను సన్నుతింతునూ ॥అం॥ కంబుకంఠి లోకమాత జీవనీ - ఘనముగ వేదంబులును శాస్త్రం బులు బిలుకును యిలను - లోకంబున నీసరి గానబడరుగదా ॥అం॥

గీ॥ నన్ను బ్రోవంగరాజాతువా నళిన నయని♦ భక్తురాలనుగానకో బాధపెట్టు ♦ న్యాయమేనీకు నిదియు నన్యాయముగద ♦ కరుణలోనన్ను బ్రోవవే కాళికాంబా॥

వ॥ హేలోకమాతా తల్లిదండ్రులులేని యబలనగు నన్ను కటాక్షించి రక్షించుకొనుము తల్లీ జనలోకకల్పవల్లీ.

దొం॥ చౌలమద్దీవాసునీ - చక్కనీ రమేశుని ॥చౌ॥ సన్నుతింతు యీశనీ - బేలనిన్ను కాలికిచ్చి మేలుగొందు నింకజూడు॥

(అని కత్తి చేతబూనియున్న తారవడకును)

దొం-వ॥ యేందే యేమొ వనుకుతున్నవు.

తా-వ॥ అయ్యో నీవు కత్తి చేతబూనినఁ జూచి నాశరీరము గడగడ వనుకుచు కంపమొందుచున్నది నోట మాటరాకున్నది యికనైన దయ దలంచి నాప్రాణములను గాపాడుము తండ్రీ.

దొం-వ॥ కేందే కూడెట్టి నిన్నుసాకుదానికి దెచ్చాననుకొన్నావు బేగి మొక్కు.

(అని తల వెంట్రుకలు బట్టి వంచును నంత జయసింహుడు అట్టి దొంగను చిక్కబట్టి తన చంద్రాయుధంబు జంపించుట)

జ-వ॥ నోరేవోరే దురాత్మా యబలయగు నిబ్బాలికను జంప బూనితివా యిదే కాళికి నిన్ను బలియిత్తును చూడుము.

(అని వానిని సంహారించిన తార జయసింహుని గాంచి చేతులు ముగిచి)

తా-వ॥ అహా మహాత్మా మృత్యుగంహారమునుండి కాపాడిన తమ కిదే పదివెయిల వందనములు యొనరించెద నన్ను కటాక్షించుముతండ్రీ.

జ-వ॥ బాలికా వర్ధిల్లుముగాని నీవెవ్వరో నాకుందెలుపుము.

డైలాగ్ - (అన్న నిన్నిటనుగాంచనె)

తా॥ యేమనిదెల్పుదు మీకు - నా వృత్తాంతము శశ్లోక ॥యే॥ తామ తెవ్వరోకాని యదినామదిలింతగుప్తాని గనక్రీమహేశుడవో శ్రీశుడవోసుమీ ॥యే॥

వ॥ మహానుభావా నాప్రాణంబులు గాపాడుటకై యింకువిచ్చేసిన నీవు యీశ్వరుండవో లేక జగదీశ్వరుండవో యని తోచబడుచున్నది. ఆహా నేటికి నీవలన బ్రతికితిని కాని నాకష్టములు మీకేమని తెల్పుదు స్వామి.

జ॥ బాలామణి నినుగన్న - మది - జాలినొందె మదివిన్న - వాలాయము నీవారూ యెవ్వారో తెల్పు నీపేరు - యిదియేల నీకుశ్రమ యెట్లఘటించెనో ॥బా॥ ౩॥

వ॥ పుత్రీ యేను భూమీశుడనుగాని జగదీశుడనుగాను నీవునన్నిట్లు పెంపుజేయవలదు నీజనని జనకులు యెవ్వరో శీఘ్రంబునందెల్పు.

తా-వ॥ ఆహా యితండెవరోకాని కన్నతండ్రివలె మాటిమాటికి బాలికా యని బిలుచుచున్నాడే యితనింజూడ రాజ వంశునిగావున్నాడు. (ప్రకాశముగా) అయ్యా !

తా॥ తలిదండ్రిని దలచినను మది నిల్వబోదు దుఃఖమునూ ॥ త ॥ నళిన సంభవుడు యిటుల - కఠినత వ్రాసెను నొదుటా - యెటుల దరి జేర్పంగలడో తెల్పుమి ॥త॥

వ॥ ఓదివ్య పురుషా యెవ్వరైననేమి నాప్రాణములు గాపాడి నందువలన నీవు నాపాలిదైవంబని యెన్నుచుంటిని తండ్రి నాతల్లిదండ్రు లున్నను యిట్టికష్టముల పాలవుదునెట్లు మన్నించుము.

జ-వ॥ (తనలో) అబ్బా యిదెంత నీతివంతురాలు యీమె కంఠ స్వరము వినగా మున్నెన్నడో వినినట్లున్నది యీబాలికను కన్నవారు లేరా యేమి. (ప్రకాశముగా)

జ॥ వాలాయముగను మిన్నా - గల చాలమద్దియందున్న - నీల వర్ణుడా శౌరీ నిన్నేలగలడు నగధారీ — జేలా నీయొక్క పేరును దెల్పుము॥

జ-వ॥ బాలికా నీతలిదండ్రులపేరుం దెలుపక యున్నను నీపేరైన దెల్పుము.

తా-వ॥ అయ్యా హృదయసేన మహీపాలుని పుత్రికనగు తారను [illegible].

(విజయః విస్మయమొంది)

వ॥ యేమి వుదయసేనుని పుత్రికయగు తారవా హా ! వుదయసేస భూపాల నీపుత్రికకు యెట్టి యాపద లోనగూడినది (అని తారనుదగ్గర జేర్చి) బిడ్డా నీకెట్టి కష్టములు సంప్రాప్తమైనవి అమ్మా నన్ను వేరుగా నెంచకుము నీతండ్రి కాప్తమిత్రుండనగు జయసింహుడను రాజ పుత్రుం డనుగదా.

తా-వ॥ అయ్యా నీవు జయసింహుడవా అహా నేటికి నాకష్ట ములందీరి పోయెనుగాని యింరాక దఃఖములోబడి యున్నయేను తమ ను గుర్తించనందున క్షమింపుడుతండ్రి.

జ-వ॥ తారా మీతండ్రిని క్రూరసేనుడు జంపెనని విని వానిజంప వలెనని బోవుచుండ నీవిట్లు బాధింపబడు చుండుటయు చోరుండు నిన్ను బట్టుకొని పోవుచుండుటయు చూచి వచ్చితిని బిడ్డా యేకాంగివై యిట్లు న్నదానవు అయ్యో నీవెంత క్షుద గొనియుంటివో సర్వసంగతులు పిదప తెలుసుకొనియెద కాని యిపుడె మద్గృహంబునకుం బోదము రమ్మ.

తా-వ॥ చిత్తము అటులనే వచ్చుచున్నదాన (అనినిష్క్ర మింతురు)

(అరణ్యములో కనకసేనుడు (తనలో)

కన-వ॥ అక్కటా యిదియెంత వింతగానున్నది నేను వచ్చిన దారియగుపడక యున్నది గదా యెంత దిరిగి చూచినను మాతార గన బడక యున్నది యికనే నేమి సేయుదు అహా శ్రీహరీ మమ్మెట్లు శ్రమలం బెట్టుచున్నవాడవు.

అనుబంధం

కన॥ దయజూడరా శ్రీహరీ - దయసాగరా మురారి - నయ మానసనిన్ను - నమ్మితిగ్ దానవారి ॥దయజూడరా॥ (హాతారా)

సీ॥ దాహము దాహము దాహమటంచును ♦ దరిలేక నీవెందు నరగినావో ♦ స్మృతిదప్పిపడియున్న స్థితిలోన నిన్నుయే ♦ మృగమైన జంపెనేమో యెరుంగ ♦ తమ్ముడు దేడునే ద్రావనీరంచును ♦ కోపించి మదికెంతొ గుండినావో ♦ నిర్దయుండనినన్ను నిందించిమనసులో ♦ విడ నాడితంచును విశికినావా॥ గీ॥ అకట కష్టంబులునువచ్చు నందరికిని ♦ యెందబోయితో నీజాడ నెరగుదెటులో ♦ అక్కడదప్పి నామాదనలగి నావో ♦ యేమిదోచదు నామది కేమిసేతు॥

వ॥ భగినీతారా నీవెందుబోయితివి దాహబాధచే పీడింపబడుచు నన్నెంత దూరితివోకదా నీజాడ నెందరయువాడను యికనేనిన్నుబాసి జీవింపగలనా! అక్కా నావంటి దురాదృష్టుండెందయిన గలడా హాఁ జగ ద్రక్షకా,

కన॥ తలిదండ్రులనుబాసియు - దాయాదునికోసియు ॥ తలి ॥ నిలచితి నొంటరి - గానిట్టి కాననమందు ॥తలి॥ ౨॥

వ॥ హా దైవమా నేనెంత దురాదృష్టుండను.

గీ॥ తండ్రి గోల్పోతి తల్లి పినతండ్రిచేత ♦ జిక్కి కష్టాల బడు చున్న చింతతోను ♦ జేయునదిలేక మనమున జిక్కి తార ♦ గోరనీరము దేనేగి గోలుపోతి॥

వ॥ కావున శ్రీహరి నావంటి నిర్భాగ్యుడెందైనం గలడా నీవు నన్నిట్లు శ్రమలం బెట్టుటకన్న నొకసారే ప్రాణములుం దీసివేసిన మేలు గాదా దీనుడనగు నన్నేల వెతలం బెట్టెదవు యించుకయినం దయ రాద.

కన॥ ధరణీ శ్రీచాలమద్ది ధామా శిరమణిలోల ॥ధ॥ కరుణరాదా నామీద - కరివరద భక్తపాలా ॥ధర॥3॥

వ॥ నీవు దయామయుండవై యున్నవని పండితులందరు యను చుందురు గాని అదియుకల్ల నమ్మినవారినే చెరుపుచుందువుఅదియెట్టులన,

సీ॥ నీవెమాగతివంచు నెమ్మనమున నమ్మ♦వారికే కష్టముల్ వచ్చు చుండు ♦ నీవెమాపతివంచు గావుమంచని వేడు ♦ వారికేరోగముల్ వచ్చు చుండు ♦ నీవెమాగురువంచు నిన్నె నమ్మినధాత్రి ♦ వారికేగండముల్ వచ్చుచుండు ♦ నీవెమమ్మలదయన్ గావుమంచని వేడు♦ వారికుపద్రవాల్ వచ్చుచుండు॥ గీ॥ సర్వమున్ నీవె యంచునుసజ్జనులకు ♦ గూర్చుచుందువు యెన్నె న్నొ గోడుబెట్టి ♦ బ్రతికియుండియు జచ్చినవారివోలె ♦ జేతువర యగ నీమాయచేముకుందా॥

వ॥ అయ్యో నేనెంత యజ్ఞానుండను తెలిసితెలియక నిన్ను దూరు చుంటినే యెవ్వరెవ్వరి. ఖర్మానుభవము లెట్లుండునో యట్లే యనుభవింపక తీరవుగద యట్టి యనుభవంబులకు నీవేమి చేయగలవాడవు యేను పాప కర్ముండనయ్యు నిన్ను నపనిందితిని కావున నిట్టి యాపదల నొందుట

కన్న మరణంబె యుత్తమంబని తోచుచున్నది కాబట్టి యీపాషాండం బునకు నాతలయుఁ గొట్టుకొని ప్రాణంబులు విడిచెదగాక.

(అని యుకొకుచుండ నొకయోగి గానంబడి)

యోగి-వ॥ పుత్రా నీవెవ్వరు యేలనిటుల శోకింపుచు యొంటరివై నడచిపోవుచున్నాడవు నాకుం దెలుపుము.

కన-వ॥ యోగిపుంగవా మీకిదే నమస్కార శతంబు లర్పించుచున్నాడను. మహాత్మా నేను తలిదండ్రుల గోల్పోయి తుదకు నిట్టి యరణ్యములో తోడబుట్టిన నాభగినిఁ గూడ బాసి చింతింపుచున్నాడ నాగతి యేమి స్వామి.

యో-వ॥ కొమారా నాదివ్యదృష్టి చేతను నీవృత్తాంతంతయు నెరింగితిని సరి నీవిదారిఁ బోయితివేని సకల శుభంబు లొనగూడును యిక నీవెంతమాత్రము వగవపనిలేదు ముందు నీకు మిక్కిలి జెయం బగును. పొమ్మా నేనేగుచున్నాడను (అని వెళ్ళిన కనకసేనుడు)

కన-వ॥ యిదియేమి వింతగానున్నదే నాకేమొ మేలు చేకూరు నన్నది యేమో యేలా యీ ఆశలు.

గీ॥ భగినిఁ బాసి తలిదండ్రి బాసియిట్లు ♦ యొంటరినై కాననము నందునుంటినకట ♦ మౌనివర్యుండు ననుగాంచి మాకుముందు ♦ శుభము గల్గునటని దెల్పె చోద్యముగను॥

వ॥ అట్టిమహాత్ముల యాశీర్వచనము లూరికేపోవునా వారునుడి విన రీతిగనే యీమార్గంబుఁ బట్టి పోయెదగాక.

(అని బోవుచున్న నచట)

భ-వ॥ అకటా మాజయసింహ భూపాలుడు తన స్నేహితుడగు పుదయసేనునికి సహాయ మొనర్పంబోయి యింకను రాడాయను గదా కారణమేమొ తోచకున్నది (అంత కనకసేనుని రాకడనుగని) యెవ్వరో కాని యొక రాచకొమారుండిటకు వచ్చుచున్నవాడు మంచిది రాకొమ్మ వారి వృత్తాంతం బెటువంటిదో తెలుసుకొనియెదగాక.

కన-వ॥ యోగులు నుడివిన రీతిగనే యంతవర కేతెంచితి గాని యింతకేని మేలు చేకూరకున్నది గదా (అని ముందుకుఁ జూచిన నొక

పట్టణంబు గానుపించిన) ఆహా యీపట్టణం బెవరిది కాబోలును యెంత శృంగారమై యున్నది దీని నొకసారి వర్ణించెదగాక.

అనుబంధము

దర్వు॥ యెంతో శృంగారమీపురంబూ - కాంతియై యొప్పును ఘనంబూ ॥యె॥ వింతయైదో చెనామనంబూ - కాంతుడెవండో కా నిజం బూ ॥యె॥౧॥ కనక మయమైన గోపురంబులు - గనగనద్దాల మంటపములు - ఘనవిచిత్రంబగు భవనములు - అనిమిషాధి పతివిభవమూ॥ యెంత॥౨॥ చుట్టు ప్రాకారముల్ వెలంగు - నట్టికోటల్ మరిచెలంగు- నట్టె కందకముల్ గలంగు - నట్టి స్వర్గంబనంబరంగు ॥యె॥౩॥ ధారుణీ చాలమన్ది షౌరి - ఖామడై వెలయుచక్రధారి - మీరిమిన్ నాయెడన్ దలంచి - కోరికల్ నాకొసంగుమించి ॥యెంత॥

వ॥ ఆహా సర్వేశ్వరుండు నాదీనాలాపంబులువిని నాకిట్టి నగరంబున్ జూపించిన వాడె సరి మంచిదిగాని యిందొక్కద్వారంబు మూయబడి యున్నది తెరచి లోనికిబోయి యించుక బడలిక దీర్చుకొనియెదగాక.

(అని ద్వారంబున్ దీసి లోనికిబోయినను యచ్చోట నొకభటుండు కనకసేనుంగని)

జుల్వ - డైలాగ్ - కనక - భటు.

భ॥ వందనమయ్యా - మీ వెవ్వరో తెల్పుండయ్యా ॥వం॥ బృందారకులకు సరిగాబోలిన వాడవు మరుసమా సుందర విగ్రహుడవునిన్ - జూచిన నాశ్చర్యంబగు ॥వంద॥

వ॥ అయ్యా మీ రెవ్వరు మీజననీ జనకుల నామాంకితంబులు దెల్పుము.

కన॥ యేమనియందు - నాశ్రమ లెంతని తెల్పుదునిందు ॥యె॥ భూమిన్ గలదె ననుంబోలిన దుర్భాగ్యులు - సుత్రా మార్చితుడౌ శౌరికి - దయరాదాయనునాపై॥

వ॥ యేను వుదయసేన మహీపాలుని పుత్రుండనగు కనకసేనుండను నాకష్టములున్ దెలుపుటకు నొక మాసమైన సరిపోదు పిదప నీకున్ సర్వంబుం దెలిపెద గాని యీనగరము పాలించు వారెవరో తెలుపుము.

భా-వ॥ అహా మహాత్మా నీవుదయ సేనుని కుమారుండవగు కనక సేనుడవా సరి మంచిదిగాని యిటురండు.

భా॥ చింతింపకుడీ । మదిజయ । సింహాకధిపతి యనుడి ॥చిం॥ పతంబున మీతండ్రిని యంతము నొందించెనని । యంతటవిని కఠ్వారుని బరిమార్చెద నని జనియున్నడు ॥చింత॥

వ॥ ఆహా కనకసేనా మీమీకష్టంబులు మాకిదువరకె నెల వైనది మాజయసింహుడు కఠ్వారసేనుని సంహరించబోయి యున్నాడు. యిదువరకైన రాడాయెను కాబట్టి వారు వచ్చునందాక మీరీ సింహాస నంబున కూర్చొని రాజ్యంబేలుడు యీ జయసింహుడు మీతండ్రికి మహామిత్రుండుగద.

కన॥ సంతసమాయె నేటికి । సర్వంబును జెయమాయె ॥ సం ॥ మంతనమున వరచాల । మద్విపురీశుని దలచిన । స్వాంతంబున గల్గిన భావంతములన్నియు దొలంగెను ॥సం॥

వ॥ మంచిది అట్లులనే రాజ్యంబు పాలింపుచున్నవాడగానినీపేరుం దెల్పి నా కనేకముగా క్షుద యగుచున్నది యిట్టి క్షుద్బాధ దీర్ప వలయును.

భ-వ॥ అయ్యో రాజనందన మీరెంత అలసిసొలసి యున్నారో యిపుడె స్నాన సంధ్యానుష్ఠానంబులు తీర్చుకొని తృప్తిగా భుజించుము తర్వాత కొంచెము విశ్రమింపుడు నేను యిచ్చోట కావలిగా యుండెదను లోనికిం బోవుదము రమ్మా. (అని నిష్క్రమింతురు)

—♦ బెస్త బోయిలు ప్రవేశం డైలాగు ♦—

అ॥ పోదాము యేమిరా బుచ్చిగా । ప్రొద్దేమొ బాగాయెరా బుచ్చిగా ।.పోదాము పెద్దోలల్ బుచ్చుకొని సముద్రాము । మీదనోట లెక్కియు । రాదీతము చాపలను ॥పో॥

స॥ వరె బుచ్చిగా యేం జేత్తున్నావురా యేమైన పెళ్ళామును జూచుకుంటు యెప్పుడు పొయిదగ్గిరనే కూర్చుంటావు యిట్లయితె నీవెట్ల బ్రతుకుతావురా.

బ॥ వత్తి వత్తి యుండరా అచ్చిగా । మత్తి నీకొచ్చిందిరా అచ్చిగా । బెత్తకులంబునకు పెద్దిరిక మేలావు । యిత్తుల్ లేకున్నగాని । యెంతెంతో పోకడాలు ॥వ॥

వ॥ అచ్చిగావోరచ్చిగా అబ్బా యేమినీపెద్దరికము నీవునాపెళ్లాం మందర యీచూపెట్లంటివిరా నిత్తెనిత్తె సాపలకు నేంబిలక పోతె నీవెన్నడు బిలిచ్చావురా పిలకపిలక యీాయాల బిలిచిండేమో అవ్వో నీమాటలు యిగ పోదాంపా.

అ॥ యెక్కవలాడకురా - బుచ్చిగా - నిక్కి నీల్గాబోకురా - బుచ్చిగా - చక్కంగకూటికి దిక్కెత్తెలేదుగాని - ముక్కుకు పెండ్లానికి ముక్కెర జేపిత్తనంటౌ ॥యె॥3॥

వ॥ అచ్చా నీనీల్గుడు ఆడంతోల్లకు జెప్తవురా నీవేమొ వుత్తుత్తుంగనె పెద్దిర్కాలు గిద్దిర్కాలు అంటావు యిట్లంటు వోళ్ళు బడ్తారను కొన్నావు నీకంటె నాకేంతక్కున్నది చెప్పరా.

బ॥ చాలమద్దిస్వామినీ - అచ్చిగా సక్కంగ దల్చుకోని- అచ్చిగా ఆలయముగ మనమందరము గూడిపో - వాలె చూడుమింక మేలౌను మనకెంత॥

వ॥ అరె అట్టిమాట లెందుకు పొద్దెల్లి యింతెక్కినాది యిటు సూడు యీా యొలల్ దీసుకోని బేగియెల్తా పోఅస.

అచ్చి-వ॥ ఆ గట్లామాట్లాడు యిగా పోదాందా అసా.

(అని సముద్రంబు జేరి అచ్చిగాడు బుచ్చికాన్నిగని)

అ-వ। పరె బుచ్చిగా నేను యీారేవుకు వోలెత్తాను నీవా రేవుకు బోయి వోలెయ్యిపొమ్మ్మ ఆందరొక్కతాన్నె వోలెత్తెట్లరా బుచ్చిగా.

బు॥వ॥ నువద్దెరా నివిక్కడెత్తె నేనింగోరేవు కెల్తా వుండ్రా.

(అని పోయినను అచ్చిగాడు వోలవేయు నందుల విమలాదేవింగని)

అ॥ వవ్వారె నేవొలేత్తె సాపరావాల్నా । సక్కని ఆడిదొచ్చిందిగా యిదేమిచిత్తరం యిదియోల్లకు చెప్పాదు దీని దీసుకొని పొల్లంగ యిదే యింటికెల్తా.

(అని విమలతో)

అ॥వ॥ పిల్లాపిల్లా నేచాపలకంట వోలెత్తె అండ్లనీవొత్తివి యిక మాయింటికిరా పోదాం.

వి॥వ॥ (తనలో) అకటా శ్రీహరీ నాబ్రతుకెంత విహీనమైనది సకల కష్టములు దొలఁగునని సముద్రంబున బడినను ప్రాణంబులు బోక మళ్ళి యీాదురుమార్గునికి జిక్కుబడితినిగదా యిక యేమిసేయుదు.

అ-వ॥ పిల్లా నావెంబడి నడు మాయింటికి పోదాము పదుము.

(అని దోడ్కొని పోయిన పిమ్మట బుచ్చిగాడొచ్చి)

బు-వ॥ అచ్చిగాడు నాతో నుండి నేనిక్కడ వాలేత్తాను నీవక్కడ కెల్లుమని చెప్పి ఆడు నాకుకలకనే యింటికెల్లిండె అప్పుడాడెంత అగలు బలికెను అనికెంత పెద్దపాపరబడిండొచ్చు నాకు పొత్తియ్య బడ్డాదని యెల్లిండుగా మల్లెన్నడైన నాకు పెద్దసాపర పడ్తె ఆడికి పొత్తుయిత్తాను ఆనాటి కడగుతె సూత్రగాక. (అని వెళ్ళును)

(అచ్చిగాడు విమలంగని)

అ-వ॥ పిల్లా వోపిల్లా యిదె మాయింట్ల సూత్రివా మరి యిక నన్ను లగ్గం చేసుకుంటావూ యేం చెప్పవు యేం మాటాడుకోకనే యుంటివి.

వి-వ॥ (తనలో) ఆహా దైవమా యికనేనేమి సేయుదు దినదినం మింత విపత్తులే పెరుగుచున్నవిగాని ముగియకున్నవి.

గీ॥ మరిది క్రూరునిబాధకు శరధినిబడి ♦ యున్న ప్రాణంబులును బోక యుండెనిపుడు ♦ వీడునన్నిటకు దెచ్చి విహితమింత ♦ లేక నిటు లాడు చుండె దుర్నీతులకట॥

వ॥ పూర్వజన్మంబున నేనెంత పాపంబు జేసియుంటినో అందుకే యిట్టి కష్టము లనుభవింపుచున్నదాననుగదా (ప్రకాశముగా) అయ్యా యేల నిట్లు బలికెదవు యేనుపతివ్రతను నాపై యిట్టి యాశ మానుము.

అ-వ॥ యేందే బలే మంచిదానవు పాపము నీవుచచ్చిపోతుండా వని నీల్లల్లనుంచి నిన్నుగడ్డకు తీసినందుకా నేను జెప్పినదాని కొప్పుకొనక పోవుటము యిక నిన్నెట్లయిన లగ్గం చేసుకోని తీరాలే యింటివా.

(విమలాదేవి ఖిన్నురాలై యున్నంజూచి)

అ॥ రాయెరాయెపిల్లా - రచ్చించుకోయెనన్ ॥రా॥ నాయింటి కాడనుండి నాకింత అండెయ్యి ॥రా॥

వ॥ యింగో యున్నావా నన్ను లగ్గం చేసుకుంటె నీవు సాల సుఖ పడ్తావు నేను మంచోన్నిసుమా నిన్ను సాలపేరుజేస్తాను నాకుపెల్లాముంది గాని ఆది మంచిదిగాదె నీవే మంచిగా యున్నావు ఆపెల్లానికన్నానిన్నే యెక్కువజూత్తాను యింటె.

వి॥ వలదయ్యా యీవిధీ - దలుచాగ రాదికా ॥వ॥ ఫలమేమి నాయెడా - భ్రాంతిపడ బోకికా ॥వల॥

వ॥ అయ్యా నేను భర్తలేని దానసగు వెధవరాలనుయిదియుంగాక చావ సిద్ధమయ్యేయున్న పెద్దమనిషిని నాకేమి లగ్నమేమి నీకుండగిన భార్య గలిగుండగా నీకింకేమి లగ్నము యిదియేమి నీగుణము నాయనా వట్టిగా నన్నేల భంగపెట్టెదవు నీకు నేను మాతృసమానురాలను కావున నన్నిట్లు బలుకకుము బలికినను మహాపాపము ఘటించును.

ఆ-వ॥ యేందే నాకు పాపము తగులుతాది నీవు మాయమ్మవా నానాయిన్న పెళ్లానివా మంచిమాట జెప్తావులే వూకోవూకో.

ఆ॥ అట్లంటె నీకునే యింటాననుకున్నావా॥అ॥ యెట్లయిననింగూడు దట్టింటొన్నిగానీ ॥అట్లంటె॥

వ॥ అవ్వో నేనోన్ననుకున్నావు జెల్లోల్లందరికి పెద్దకులత్తున్ని అందరు నేజెప్పినట్టె యింటారు యిన్నవామరి నీకు మొగడులేడు. లేకుంటెమా నే లగ్గం చేసుకుంటె మార్మానమనుకుందాము యేం చెప్పవు.

వి॥ అట్లయిననీకుయీ కఠినంబు గూడదూ ॥అ॥ కుటిలంబులేక నన్ కృపజూడ మేలగు ॥అ॥

వ॥ అయ్యా నీవు నాప్రాణములు గాపాడినందున నాకునీవు తండ్రి సమానుండ వవుదువు నీకు నే కన్నకూతురు సమంబౌదును కావున నన్నుగురించి యిట్టి పాపకృత్యంబులుౕ జేయందగదు తండ్రీ.

ఆ-వ॥ వొస్సే నీల్లల్లో వోలై నంబడితె వొడ్డుకు తీత్తె ఆల్లందరు బిడ్డలేనా బల్కి పెల్లామై పడ్డాదనుకో మొగడు గడ్డకుతీత్తె అప్పుడాడో డౌతాడు తండ్రి యాతాడా అబ్బా నీయేదాంతాలు నాకు తెలియ దను కున్నావ వూకో.

ఆ॥ అబ్బా నీయేదంతాలన్ని దెల్సునాకూ - గొబ్బున నినొ్నొక్క దెబ్బత్తె యింటావు ॥అబ్బా॥

వ॥ వసే నేనుజెప్తె కొంచాన యినేటట్లులేవు వొక్క దెబ్బత్తె చూడు గట్లయితె యింటావు నన్ను పెళ్లిచేసుకో నామాటయిను లేకుంటె నీవు బతుకవు చూడుము.

వి-వ॥ (తనలో) అకటా నేనేది మాట్లాడినను నాకే వికట మగుచున్నది గదా కాలముగానప్పుడు గొర్రె పులియై కరుచుచున్నసామితే సరిపోవుచున్నది కానిమ్మ శ్రీహరీ.

వి॥ చాలమద్దీశ్వరా శౌరిసర్వేశ్వరా యేలీలనైన నన్నేలు కృపాకరా ॥చా॥

వ॥ హా జగదీశ్వరా నీవుంజేయు విషమ పరీక్షలకు నేనోప్పగలనా యేల నిట్లు బాధపెట్టెదవు యిన్ని పరీక్షలు జేయుటకన్న నాక్కసారే ప్రాణములు తీయరాదా యిట్టి కష్టములకంటె నదియే మేలైనదిగదా (ప్రకాశముగా) అయ్యాతమరెన్ని విధంబుల భయంబుజూపినను నీమాట నేనొప్పను నన్ను సముద్రమునుండి తీసి కాపాడితిరి గాన మళ్ళి నన్నదే సముద్రింబునకే వేయుము అటులైన నాకేలాటి కష్టములుండబోవుగదా అయ్యా.

అ-వ॥ అబ్బో నాప్రాణంబులుబోయిన మల్లి నిన్ను సముద్రములో పారవేసేనా పారేసినంక నాపానం నిలిపేనా అమ్మయ్యోఅట్లొద్దునన్ను లగ్గం చేసుకుంటివాయనా నా పానాలన్ని నీకే పట్టి తేచ్చిత్తాను బువ్వకు నూకలుబోసియొండ నీకిచ్చి అంత పెత్తనము నీకేయిత్తానునాపానంనైన నీచేతిలో పెడ్తాను యింతెయిఁనుయినకుంటెనిన్ను సాలాకష్టపెడ్తానుచూడు

(అంతలో వీనిపెండ్లాముపచ్చి మొగనిగని)

పో-వ॥ ఆరె అచ్చిగా నీతలపండు బల్గా యిందాక యెటుబోయావురా అదోతురా నేంజాలనని యింకోపెల్లాముం దెచ్చుకున్నావు నా కుక్కలకొడుక (అని కొట్టును కాలుతో తన్నును అచ్చిగాడు)

అ-వ॥ ముండా కొట్టకే కొట్టకే నీకు దండంపెడ్తానే చేసుకొన్న మొగన్ని తంతారే పాపంతల్గదే వొద్దువొద్దె నీబాంచనే.

వి-వ॥ (తనలో) అహా యిదియేమి యీసతిపురుషుల సరసోక్తులు భయభక్తులనే మర్యాదలు యెంతమాత్రము లేవుగద వీరి నాబ్రహ్మ దేవుడు సరిగా యెట్లుగూర్చియున్నవాడు అదియట్లుండనిమ్మగాని యీ దుష్టులు నన్నేమి సేయుదురోకదా శ్రీహరి ఇకనాకు నీవేదిక్కు.

(అ-త పోచి మొగనితో) డైలాగ్

పో॥ కొట్టకని యంటావు - కూడేమి తింటావు - పొట్టకిత్తుల్ లేవాని యెల్లెర్క లేదునీకు। కొట్టకని॥ తిట్టెదను - జుట్టుఁబట్టితన్నెనను॥కొ॥

వ॥ ముండాకొడ్కా— దంచండుదామింటెయింట సారెడిత్తున్నా యూ తులమెత్తుప్పు గతున్నదా యికనీకేమండి పారొయ్యాలెరా నిన్న గాంక రాజయ్యదొరగారి కాళ్ళమీద రాంరావు దొరవారి కాళ్లమీద బడతే చెరి అద్దడిత్తె దంచండేత్తి తిండిటివి యియ్యాల్లేందింటావు నీకు సోయెందుకు లేకపోయెనుర నాబాంచాల కొడుక.

అని చీపిరితో కొట్టును.

అ॥ కొట్టాకె తిట్టాకె కోపంబు జెయ్యకే ॥కొ॥బుట్టెడన్ని జిమ్మల్ బట్టుకొని అచ్చినాను॥కొ॥యట్టె యవ్వమ్మకొచ్చి పొట్టకుదిందాము ॥కొ॥

వ॥ లంజముండా సాపల్ బట్టుక రాలేదనినన్ను గొడ్తున్నావు అం డ్లన్నెజూడుము బుట్టెడు సాపల్ దెచ్చినాను అవ్వవిన్న గింజలు గొను కొచ్చి తిండి అండే అండ్లయే గోసికన్ని తీసి జిమ్మల్ గూరండుము అందరి పెండ్లాలు నీతీరుంగనె గొంత తిడ్తున్నారే నీవేల నాకుదాపనమైతివెలంజ.

సో॥ పొయ్యిమీదికిలేదు - పొయ్యికిందికిలేదు - యియ్యాడు దాన్నెడ యెత్తుకొచ్చావు - కయ్యంపెడ్తావింక కండ్లెర్రజేత్తావు ॥పొ॥

వ॥ నీవు పొద్దుందాంకపోయిపోయి బుట్టెడు చాపల్ బట్టుకొచ్చి ఆడేయంగనే ఆయనా అండ్లకుప్పెట్లా నిర్వకాయలెట్లా చింతపండెట్లా నూనెట్లా సెప్పవు మొన్న పొద్దుందాక దంచబోయితె కయికిలిచ్చిందే గాక పడిగెల గంగరాం సావుకారి భార్య గంగవ్వకడ్పు చల్లగుండ చూచి చూడక యింతుప్పత్తె నిర్వకాయలు చింతపండు బెడితె అది మూడొద్దుల్ జేత్తె నీ నేంజేసినది నీకెరుక బడతాదా అది బోనిగాని యిదోలో నాకుజెప్పు.

అ॥ చాలమద్దిసామీ - సాచ్చింగ నీతోడు - ఆలాయముగ నీకం తాజెప్తాయిను - చాలపుణ్యంబు చక్కంగ బండేను ॥చా॥

వ॥ వొసేముండా యిటిను సాపలకని పెద్దొలేసుకొని సముద్రాని కెల్లి వొలేసి దీశాలకే యిండ్ల యిదొచ్చాది సూశాలకొ నాకండ్లు మూసుక పోయాయి యిదినీకు తోడుంటదంట యింటికి దీసుకొచ్చాను నన్ను పెళ్లి చేసుకొమంటె యింటలేదు యిన్నావా.

పో-వ॥ వొరి యెదవనాయలా యీ మొగానికి నేసాలక యింకో పెళ్లొకట నాకే కూడు బెట్టనికి సాతగాక యేడుత్తున్నావునీమొగంగాల. (అని చీపురుతో కొట్టును)

అ-వ॥ (తనలో దీన్ని మల్లగౌడతామంటె నాకు చేతులేరావు వొక్క దెబ్బకె కింద పడదంతుగాని అలగి పండేన మూడొద్దుల్ దాంకా నాను డెండుతాది అందుకే పెండ్లాము చెప్పినట్టినాలా కొట్టినట్టు బడాలా అందుకె పెండ్లాము పెద్దగురువని శాస్త్రమవద్దమా.

పో-వ॥ ఒసే యిక్కడినుంచి వెల్లుము (అని విమలనుగొట్టి వెల్లించును)

(మరల అచ్చిగాడొచ్చి విమలంగని)

అ-వ॥ వొసే యిది మనపాలిటి దయ్యాంసుమా ఇంక దీని కంటి కగుపడక యెటన్న దబ్బన యెల్లు అదిమల్లొచ్చెనా నిన్నునన్ను పానం దీస్కుంటాది యెట్లా.

(అనిన విమలాదేవి బ్రతుకు జీవమా యని పరుగెత్తి పోయి యొక అరణ్యంబున జేరి)

వి-వ॥ అహా శ్రీహరీ యే నోముఫలము చేతనో యాస్త్రీవలన దురాత్ముని బారి తప్పింపబడి యీ ఘోరారణ్యంబు జేరితిని యిక నెచ్చట కేగుదానను యెవ్వరు నాకున్ బంధువులు గలరు యున్నను హీనదశనగు నాకేమి మేలు చేయగలరు బ్రతికియు చచ్చినదాన నైతిని గదా హా సర్వేశ్వరా.

అనుబంధము.

ది॥ కమలేశ యెంతటి - కష్టములు ప్రాప్తమాయె ॥ అమరార్చి తమమ్మెలా నాదుకొదయా రాదాయె ॥క॥

మ॥ అనురాగంబును జూచునా విభుడు ♦ మున్నా క్రూరుచేజిక్కిపా
వనమా జీవములందొలంగె తనయునా ♦ పాపాత్ముకున్ తోబడె
వనముల్ ద్రిమ్మరుచున్నవారో యటనా ♦ పాపంబుచేలేక ఇం
పెనొతా నిర్దయుడౌచు దెలియనకటా ♦ విశ్వేశ విశ్వాంబరా॥

వ॥ అయ్యో మక్కుపచ్చలారని ముద్దుబిడ్డలారా మీగతి దలంచుకొనిన నాకడుపు భరించకున్నది వైరముచే మంత్రిని సేనాధిపతిని ద్రుంచినైన నూరకుండక నాసతినిగూడ ఖండించి నేతల్లిసమానురాలని యెంచక నన్నింత కష్టముల పాలజేసెగదా.

వి॥ పుత్రీపుత్రులుయేమి భూరిపాపము జేసిరో ॥పు॥ శతృత్వమున బాలల శ్రమబెట్టె నేమయ్యిరో ॥పు॥

వ॥ మేమతనికి కీడొనరించినను మాపసిగందులేమి జేసిరి అనాడు నాముంగిటనే మేకల బలియిచ్చు చందంబున కరవాలంబున కావాహుతి చేసెదనని పలికెను గదా అయ్యో బిడ్డలారా.

వి॥ ఇట్టి నిర్భాగ్యురాలీ - కెట్టుల జనియించితిరీ ॥ఇ॥ పుట్టినందుల కేసుఖము పూనీఘటించితిరి॥

వ॥ ఆహా జగద్రక్షకా యేలా మమ్మిట్లు విషను పరీక్షలు చేయు చున్నాడవు యిట్టి కష్టము లనుభవించుటకు పూర్వకర్మంబునందెంత పాపమొనర్చి యుంటినో తెల్యదు అందుకే ఇట్టి శ్రమలు ఘటింపు చున్నావు. .

వీ॥ ధరణీశ్రీచాలమద్ది - ధామశ్రీరామనామా ॥ధ॥ కరుణచేయిక నయినక్ గానవె పరంధామా ॥ధర॥

వ॥ హా కనకసేనా హాతారా యెన్నడు నాకన్నులకు మీరు గానంబడ రెుదరు బిడ్డలారా యెందుంటిరోకదా.

(అంతలో వొక వ్యాఘ్రుంబు వచ్చుచున్నంగని)

వ॥ అదో కొంత దూరంబునుండియు మహా భయంకరమగు వ్యాఘ్రుంబు నావైపునకే యురికివచ్చుచున్నది గదా యిక నేనేమి సేయుదు యెందులకని పోదు.

(అని పరుగిడుచుండ రామజెట్టివచ్చి తనలో)

రా-వ॥ అదొ యొక వ్యాఘ్రుంబు యొకస్త్రీని తరుముకొనిపోవు చున్నదే ఇప్పుడేదాని కడ్డంబుగా దిరిగి యీ వ్యాఘ్రుమును సంహారించెదగాక. (అని వెళ్ళి పులిని సంహారించును)

(పిదప రాంజెట్టి విమలాదేవినిగని తనలో)

వ॥ పాపము యీవనితామణి యెవ్వరు కాబోలు యీమె విల పించు చుండుటవలన నా వ్యాఘ్రుముక్ వచ్చుటంజూచి వెంట నంటి వచ్చి బరిమార్చితిని లేకపోయిన నీమెగతి యేమైపోవునోకదా యీమె రూపు రేఖ లెంచగా రాచకాంతవలె నగుపడుచున్నదిగద,

వి-వ॥ (తనలో) యీవ్యాఘ్రుము నోటనై నంబడి చావకుండ ఇతండెవడొకాని ఇటకొచ్చి యీవ్యాఘ్రుంబునుసంహారించి నాప్రాణం బులు కాపాడి యుండెనె సరేకాని ఇతండేమైన నన్ను మోసపుచ్చుడు

గదా హా సర్వేశ్వరా నాకించుక మేలుజేసి వెంటనే కీడొనరింపు చుంటివి.

ఇద్దర్కి- డైలాగ్

రాం॥ యెవరమ్మమీరూ - యీయడవిలో నున్నారు ॥ యె ॥ శ్రమలనుగొని యున్నారు - నలతేరుచు నున్నారు - నిక నవిరళముగ నీవాస్తవ మెట్టిదో వినిపింపుము ॥యె॥

వ॥ తల్లీ నీ వెవ్వరు యొకతివి ఘోరాటవియందు దిరుగుచు మహా శోకార్తురాలవై యలతేరుచున్న వేమికారణము అమ్మ నీ వెంతమాత్రము భయపడకుము.

వి-వ॥ (తనలో) యేమి ఇతండు యెవరోకాని మాటలు జూడగ సజ్జనునివలె యగుపడుచున్నవి మంచిది (ప్రకాశముగా)

వి॥ యేమని తెల్పుదును - మీతోడనే ॥ నే ॥ భూమియందునన్ బోలినవారలు - యేమానవులును యెంచగ లేరిక ॥యే॥

వ॥ మహాత్మా యేనొక నిర్భాగ్యురాలను కొన్ని కారణముల వలన నామనోహరుని తనయులను గోల్పోయి ఇట్లు నరణ్యముల నరుగుచున్న ఈవ్యాఘ్రంబు గన్ను భక్షించినను ఇట్టి నా కష్టము లన్నియు తొలంగియుండునుగదా మీరువచ్చి నన్నుగాపాడితి రెందుకు ఇప్పుడే మీకరవాలముచేతను నాకంఠంబున్ దీసివేయుడు అటులైన నాకష్టములు గట్టెక్కునుగద దేవా.

రాం॥ యెందుకు నీవిట్టులా - దుఃఖమునొందెదవు నీవికనూ॥యె॥ మదియందున ధైర్యమును- గొనియుండుము గానివినుు- యెవరిన్ భయము లేక - వినునే - సవరించెద తండ్రివలెన్ ॥యె॥

వ॥ అమ్మా నీవిటు దుఃఖము జెందెద వెందులకు యెట్టివారికైనను కష్టసుఖములు గలిగే యుండునుగాని తల్లీ నాకిద్దరు భార్యలు గలరు వారికి నిరువురు చక్కని పుత్రులు గలరు కావున మాఇంటివారితోగూడ నీవు కాలము గడుపుచుండుము నిన్ను నాకన్నతల్లివలె సవరించెదను ఇక నీకేమితొందరలేదు నావెంటరమ్మా అనిన.

వి-వ॥ (తనలో) యీతని పలుకులు నిక్కమై యుండవచ్చును ఇంతవరకైతె దుర్వాక్కులుం బలుకలేదుగదా మంచిది కానిమ్మ యెటులైన నేమి చేయగలదానను. (ప్రకాశముగా అయ్యా)

వి॥ మీరలాజ్ఞా విధమె మెలంగెదా ॥మీ॥ సారసాక్షుడౌ చాల మద్దిహరి కారుణ్యంబునుయే - రీతున్నాదో ॥మీ॥

వ॥ ఓదివ్యపురుషా నీవిట్లు నమ్మకముగా బలుకుటవలన మీ గృహంబునకు వచ్చెదగాని నన్ను రెండో విధంబుగ్ జూడవలదుతండ్రీ.

రా-వ॥ ఆహాతల్లీ యెంత మాటాడితివి యేను అటువంటివాడను గాను యెంతమాత్రము నీమది సందేహించవలదు నీకెంతమాత్రము భయంబులేదు ఇక నామాటనమ్మ.

పద్మాబాయి ప్రవేశము - అనుబంధము.

ప॥ నేపద్మాబాయినీ యాత్మాపైనను - నాసరియెవ్వరూ ॥నే॥ రూపంబునరతి రూపును బోలియు - నాపద్మాభ - నయములు గలనే ॥ నేప॥ ౧॥ సీతాంశుముఖినీ - ప్రఖ్యాతి గలుగు చాతుర్యముగలా ॥సీతాం॥ రాతిరింబగలు రాంజెట్టికినీ ప్రీతియొనర్చెటి పిన్నసతిని ॥నేప॥ ౨॥చాలగ మదీ యందునన్ - శ్రీచాలమద్దిహరి నెంతుభక్తి ॥చాల॥ నీలవేణుని యనేకముగా పద్మాలయ పూజలు - మరియు జేయు నేపద్మా॥

వ॥ నాకు నిన్నటిమేలే జరుగుతున్నదిగాని నాసవతియగు సత్య బాయి కుమారు నందమును గురించి నాభర్తకు నాపుత్రునెడ కొంత ప్రేమ యుండిలేదు కావున నాసవతి కొడుకైన మేఘవాహనునికి విషం బిచ్చిన నాపీడ దొలగిపోవును మంచిది అట్టిసమయముం జూచెదగాక.

(విమల మేఘనాధుండను బాలుడు ప్రవేశం)

వి-వ॥ మేఘవాహనా ఇకనీవు బడిలోనికి చదువుకొన బొమ్మ నీవుం బోకయున్న పంతులు గొట్టగలడు.

మే వ॥ అమ్మా చదువుకు ముదురు సాముకు లేతయని యందురు కావున యటులనే మహాజ్ఞానాంధ కారములోనుండు బాలుండను నాకట్టి విద్య యెట్లు ప్రకటమవును పెద్దవాడ నయినట్టుగా చదివినను తెలివివలనను విద్యలంటునుగదా.

డైలాగ్

వి॥ తనయా నీమృదు వాక్కులు వినగా - మనమునకు సంతసమగు చుండుగ్ ॥తన॥ వినుమిక పిన్నప్పుడు చదివినచదు - వేమిక్కిలి జ్ఞాపక ముండుగ్ ॥తన॥

వ॥ అయ్యో బాల్యమందు నేర్చిన విద్యయేవిద్య అట్టితరుణము కష్టపడి చదువనిది యేదివచ్చునెట్లు నీవువిద్యా పారంగతుడ వౌదువేని యందర మహా సుజ్ఞానవంతుడవయ్యి సౌఖ్యపడుదువుగదా.

మే॥ పద్యము నేరువకుండిన కొరుడతో పంతులుగొట్టును కోపమునా ॥ప॥ పద్యాన్నెంత పఠించినను జ్ఞాపకముకురా దజ్ఞానమున ॥ప॥

వ॥ కావున అమ్మా అన్నికష్టములకన్న విద్యనేర్చుకొనుటయే మహా కష్టముగద. యింతకు మిన్నైన కష్టంబేమున్నది.

వి॥ పాఠము జదివొప్పగించిననునిక్ - పంతులెట్లగొట్టంగలడు॥పా॥ పాఠము జదువక - నాటలాడినను పంతులుకొట్టక నూర్కొనడు॥

వ॥ నీవు బుద్ధిగలిగి చదువుకొన్న యెడల పంతులెందుకు కొట్టగలడు కావున యెంతమాత్రము ఆటంకము చెయ్యక చదువుకొన వలయును నిన్ను గొట్టకుండ నేనాపంతులతో చెప్పెదగాని యిప్పుడైతె నీవు బడికి పొమ్మా.

మే॥ తమ్ముడు రాకున్నను నేనొక్కని తప్పక బడికిని పోలేదా యిమ్మహి శ్రీచోళమద్దిపురి లక్ష్మీనరమణుడె సాక్షి యొకద ॥త॥

వ॥ అమ్మా తమ్ముడైన వాయుబలుండు బడికి రమ్మనిన యెంతకు రాడు వాడురాకున్న నేను బడికిపోయి చదువుకుంటు లేనా మరి నేను మంచివాన్నిగాదె అమ్మా.

వి-వ॥ ఆహా నాముద్దులయ్యా నీముద్దుమాటలువిన్న నాదావంతమంతయు దొలంగుచున్నది నీవె మంచివాడవు నాయిన్న.

(అని యెత్తుకొని ముద్దుపెట్టుకొను నంతలో పద్మాబాయి విచ్చేసి విమలంగని)

పద్మా-వ॥ యేమి విమలా నీకునుగూడ నాసవతివలెనే నాకుమారుడు నీకు పట్టలేక పోయెన అవునె నీకు మూడుపూటలు కూడుబెట్టునది యీలాటి పక్షపాతమునకేనా (అని బాలునింగని) అవురా యిదిమేలమా యంత బాగా చంకలో గూర్చొని యున్నావుర చంకదిగుర (అనివిమలా బాలునిదించి పద్మతో)

వి-వ॥ తల్లీ నాకేలా పక్షపాతము అందరు నాకేకమేగద నీకుమారునిగూడ యెత్తుకొని బుజ్జగించి బడికి తోలుకొని పోవుచుండ నన్ను వొదిలి నీయొద్దకు నురికివచ్చెను యిందులకు నేనేమి జేయుదును తల్లీ.

## డైలాగ్

ప॥ చాలు పోపోవే - నీలీల దెలసెనె విమలా ॥చా॥ చాలునేనీ సంభాషణలూ చొరంగ గంటినా సవతీ - బాలునీయందున్న - దయనా బాలునియందున్నదనీకు ఛీ ॥చా॥

వ॥ విమలా దాసిదానవగు నీవు మమ్మందరిని నేకవిధముగాజూడ వలయుగాని వేరువేరుగా జూచుట నీకిది తగునా.

వి॥ తల్లీ నీకేమి - నేతగరాని ద్రోహంబుజేసి ॥త॥ కల్లలేలామీ యిరువూరి - పిల్లలా నొకరీతిగానా - యుల్లమందు నెంచుకొనియు - నున్నట్టి దానహరి సాక్షిగా ॥త॥

వ॥ అమ్మా పద్మాబాయి యేనువచ్చిన యిన్ని దినంబులనుండి నామర్యాదలు నీవు జూచుచునేయుంటివి నాయందిట్ల రెండో విచార మున్నదా తల్లీ నన్నిట్లనవలెనని యంటున్నవుగాని మరేమియుంగాదు యేలా నాయెడ నింత క్రోధము తల్లి.

ప॥ యెందుకీవిట్లా యనుచుందువునా ముందరనుచాల్ ॥యెం॥ ముందూ నిన్నటిమర్యాద - యుందనిన్నటి మొన్నటినుండే మందగించి నది నీకండ్ల కెందులకై గనబడ కుండితినో ॥యెం॥

వ॥ పాపంబని నామగండరణ్యములో కూటికిలేక యేడ్చుచున్నా వని నిక్కదెచ్చి సవరించినందులకు నీకింత కండ్లకు గానరాకుండితిమి యిక నిన్ను వెళ్లించె యుపాయంబూహించెద చూడుము నాప్రతాపము

వి॥ తగదమ్మయిట్లా - నిర్దయయుణ దలుచకుమీ నాయందు ॥త॥ జగతీయందునంగల జాగీశ్చొలమద్దినివాసుండైన ఖగరాడ్వాహను సాక్షిగ నీయడా - పగయేమిలేదు మన్నింపుము ॥త॥

వ॥ తల్లీ దైవసాక్షిసుమా నీయందెంతమాత్రము నాకురెండోతీరు లేదు జనని నన్ను కరుణింపవలయు.

ప-వ॥ (తనలో) పాపము దీనియందెంతమాత్రము రెండోతీరులేదు నేనొకటిబన్నియు నిష్కారణముగా కోపంబున మాటలంటిని యెబ్విధంగ నైన యీపోరని మాయము జేయనియెడల నాభర్తకు నాకుమారుని యందనురాగము జనింపదు యీ పోరడు జచ్చునేని నాకొడుకు పీడ

బోవును నిన్ననే విషాన్నము సిద్ధము చేసితినిగాని సమయముగాక యుండెను మంచిది సమయము ఖాతుగాక.

(అంత మేఘవాహానుడు విమలంగని)

మే-వ॥ అమ్మా నాకు మిక్కిలి దాహంబు ఆకలి యగుచున్నది నేబోయెదను తల్లీ (అనినవిని పద్మాయి తనలో)

వ॥ వెదకబోయిన పాము కాలుకె జుట్టుకొనునట్లు వీనికి నిప్పుడె యాకలి యగుచున్నదే యీసమయము మంచిగా యొనగూడి వచ్చినది యిప్పుడే వీనిందీసుకొనిపోయి విషాన్నము దినిపించెదగాక. (అని బాలునితో) నాయనా నీకాకలియగుచున్నద రమ్మా నేదినిపించెద (అని విమలంగని) విమలా పిల్లనికి ఆకలియగుచున్నదట నేదినుపించుకొని వచ్చెదను నేవచ్చునందాక నీవిచ్చోటనే యుండుము (అని బాలుని చేకొని పోయి)

వి-వ॥ తనలో యేమీ యింతకు .మున్నాబాలునియందు సిర్దయ గలదియై యిప్పుడు ననురాగముచే నీకు బువ్వదినిపించెదనని యెన్నడు లేనిది నేడు యిట్లు తీసుకొనీ పోవుట కారణమేమో తెల్యదు.

(అంత పద్మాబాయి బాలునికి విషాన్నము దినుపించుకొని వచ్చి విమల కొప్పగించి)

వ॥ విమలా యిక నీబాలుని యెత్తుకొనిపోయి బడిలో పంతులుకొప్పగించి రమ్మా వేగంబున బొమ్మా.

(అని వెళ్ళిన విమల బాలుని తొడపై గూర్చుండ బెట్టుకొని)

డైలాగ్

వి॥ తనయనీవిపు డోగిరముల్ - గుడిచినవుగదా ॥ త॥ ఘనమ క్షుదాయినగెల్ గదా ॥తన॥ వినూ పిన్నమ్మయను - ప్రేమజేతను - యే మొసంగెను ॥తన॥

వ॥ తండ్రీ నీవిపుడు అన్నము గుడిచి వచ్చితివా మరినీ పిన్నమ్మ నీకు బువ్వలో యేమియుంచి దినిపించినదో తెల్పు నాయనా.

మే॥ వినవె జననిరోనికా - విధి వినుపింతును ॥వి॥ వినుపింతునూ నిను మదిని గాంతును ॥వి॥ విను వోగిరముననూ పాలుబోసెను - దినుపటనియెను ॥వి॥

వ॥ అమ్మా మాచిన్నమ్మ బువ్వలో పాలుబోసి కలిపి తానే దిని పించినది నాయాకలి దీరినది గాని మరి నీవెందుకు దినలేదు యిక మా యమ్మ నీకు బువ్వనే బెట్టలేదా యేమి నేనుంబోయివచ్చెద నీవురమ్మ.

వి॥ ఘనమోదమానూ నీవాక్కులు - వినకనగను - వినకనగను- వెతదొలిగెను ॥ఘ॥ నినూ - యనవరతమునూ - యెడబాయకనూ - వెంటనుందును ॥ఘ॥ ౩॥

వ॥ కుమారా నేనిప్పుడు భుజియించుట వలదు నీవు బడికేగిన పిమ్మట భుజించెదగాని మరి నీకు నామీద ప్రేమ యున్నదా నిజంబుగ దెల్పుము.

మే॥ ఘనచాలమద్దినగరీ - శ్రీవనజాక్షుడు - వనజాక్షుడు - జగదీశుడు ॥ఘ॥ మనా - నేలుచుదమునా - భక్తినెంచినా ॥ఘన॥

వ॥ కావున పిమ్మట అమ్మా నీకు నాయందు ప్రేమగలదా యని యడుగుచున్నవైతె నీయొద్దనే యున్నను మాయమ్మ జ్ఞాపకానికేరాదు కాబట్టి నాకు నీయందే మిక్కిలి ప్రేమ యున్నదిగద తల్లీ.

వి-వ॥ (తనలో అకటా యీముద్దుబాలుని మాటలు వినునప్పుడెల్ల నాకనకసేనుడు జ్ఞాపకమున కొచ్చుచుండెనుగదా అట్టితరి నాహృదయము ఛేదించుకొని పోవును హా కనకా నీవదనారవిందంబుం లభించుట యీమందభాగ్యురాలకి లభించు నెట్లు తనయా.

గీ॥ అమ్మబువ్వెట్ట నాకిపు డాకలౌచు ♦ నున్నదంచని యేడ్చునా కన్నతండ్రి ♦ మరల జూతునో నినులేదొ మందభాగ్య ♦ రాల బ్రతికుంటి మృత్యువురాక ధరణి॥

వ॥ ఆహా కొడుకా యిక నేనెట్లు భరించి బ్రతికియుందురాతండ్రీ.

మే-వ॥ అమ్మా నాకేమొకాని కన్నులట్ దిరుగుచు కడుపులో మండుచు దేహము పరవశమగుచు స్మారకము దప్పుచున్నది యికనేను బ్రతికేయట్లు గానంబడుతు లేదే తల్లీ యికనైనన్ నన్ను గాపాడుకొనుము అమ్మా. (అని మూర్ఛిల్లును)

(అంతలో విమల తొందరతో)

వి-వ॥ ఆహా తనయా మేఘవాహనా యున్నట్టులేయుండి యేలా నీవు విపరీతముగా మూర్ఛనొందితివి తండ్రీ. ఇది నీతల్లిదండ్రులుంజూచి

యికనన్ను సైపగలరా నాయనా వారికి నేనేమని విన్నవించవలయును హా శ్రీహరీ యింకనైన నీకు తృప్తిలేక మరల విషమ పరీక్షలు జేయ నారంభించితివా యికనాకేదిదారి నాయనా.

గీ॥ యెన్నికష్టాలనో బడి యిపుడువీరి ♦ ఇంటనుండగా నోర్వక ఇట్లుజేయ ♦ జాలినావాకో మామీద జాలిమాలి ♦ తృప్తి లేదాయెనా ఇక తో॥యజాతు॥

వ॥ హా దైవమా ఇక నేనేమిచేయుదు వీని తల్లిదండ్రులొచ్చి పిల్లన్ని యేలజంపితివని నన్నెంత దండింతురోకద హా దైవమా ఇక నాకు నీవేదిక్కు తండ్రీ. (అంత రాం జెట్టివచ్చి)

రాం-వ॥ యెవ్వరిట వాపోవుచున్నవారు. (అని బాలునింజూచి)

రాం-వ॥ హా పుత్రా యేలనిట్లుబడియున్నాడవు (అని విమలతో)

రాం-వ॥ విమలా నాకుమారుడెందుకు ఇట్లు స్మారకములేక పడి యున్నవాడు.

వి వ॥ అయ్యా యిసుమంతైనా నేకారణములేకనే యున్నవా డున్నట్టులే నాకండ్లు దిరుగుచున్నవని కడుపులో మండుచున్నదని వట్టి గనే భూమిపయిం బడియుండెనుగదా తండ్రీ.

## దైలాగు (దుఃఖములో)

రాం॥ తనయా ఇదియేమో దైవఘటనరా - వినజేయుమునా వీను లలరగా ॥త॥ మనమున నేనే - మాత్రము ఇటులౌనని కలనైనను యెరు గంజాలను ॥తనయా॥

వ। తనయానీవిట్లగుటకేమికారణముగావచ్చును (అంతసత్యబాయి)

స వ॥ నాథా నీవేల దఃఖింపుచున్నాడవు (అని తనయుంగని) యేమీ వీడు మన మేఘవాహనుండా హా కుమారా నీకిదియేమివచ్చెరా తండ్రీ.

స॥ కొడుకా నీకిది కూడెనెట్టులరా - కడుత్వర వాతో నుడువ వదేమిరా - పడిపడకను యెవ్వడు నిన్నిట్టుల - బడజేసెనో నీప్రాప్త మిదేనో. ॥కొ॥

వ॥ నాయిన్న యిప్పుడె నావద్దనుండి వచ్చితివిగదరా తండ్రీ యిం తలోనే నీకె తఖర్మము ఘటియించెరాతండ్రీ.

(పద్మాబాయివచ్చి బాలునిపైఁబడి కొట్టుకొంచున)

వ॥ హా మేఘవాహనా.

ప॥ యేలానీకీలీలఘటించెక్ - మేలుకొనియుదెల్పుము సర్వంబుక్ చాలమద్ది శ్రీజలజాక్షుడునీ - పాలగలిగి లేడాయె నహాహా॥

వ॥ అయ్యో కొడుకా నీవు వాయుబలుని బాయకుండినను నీకింత పని గాకుండునుగదా యేదురాత్ములు నీకేమిజేసిరో.

(ఇట్లు దుఃఖించి రాంశెట్టి విమలంగని)

సైలాగు

రాం॥ యిదియేమి కారణమొకా - ఇటులెౌట తోచదుయికా॥ యి॥ ఇదియేమో యనుమానంబూ - మదినోచుచుండె ఘనంబూ ॥యి॥

వ॥ విమలా నీయొద్దనె గూర్చొనియున్న బాలుడు నిష్కారణ ముగా మృతిజెందెనని పలికిన యిది నమ్మవలసిన మాటేనా.

వి॥ యేమందును మీతోను - నేనైతె యేమెరుగానూ ॥యే॥యే మాయెనో తోచదికా జగదీశ్వరునికె యెరుకా ॥యే॥

వ॥ అయ్యో మీరేమొ నాయందనుమాన పడుచున్నట్టులున్నది తండ్రీ నేనేపాప మెరుంగను నీబాలుండు నిర్హేతుకముగా మరణించెను తండ్రీ.

ప॥ కుటిలాత్మురాలివీవూ - మటుమాయ జేసినావూ ॥కు॥ పటు మాయగలదానవూ - యిటులెందుకని బలికేవూ ॥కు॥

వ॥ ఓసీ నీవెంత వగలాడివే పిల్లన్ని జంపి నేనేమెరుంగనని వగలు బలుకుచున్నావు (అని మొగనింగని) నాథా యిది మన బాలులను పాఠ శాలకుం దీసుకొని పోవుటయు మల్లి బిలుచుకొని రావుటయు నిది మహా కష్టంబని ఇట్లు జేసియుండెను యింతకుముందీ బాలుడు బువ్వబెట్టుమన దీసుకొని లోనికిం బోయి పాలలో నేమోకలిపి అన్నములో బోసి తిని పించుచుండె అప్పుడు నేనిట్లనిగుర్తించలేదు. నాకుమారునికింగూడవిషము పెట్టేదేకాని యే భగవంతుడో అడ్డుపడినాడు అహా కుమారా మేఘ వాహనా.

(అని ఇట్లుబలికి వగలేడ్చు యేడ్చుచున్న రాంశెట్టి)

రాం॥ నీవెంత క్రూరమతివే - ఇదియెంత పనిదలచితివే ॥ నీ ॥ నీవేమొ విహితాత్మవని నేనమ్మి ఇటుదెచ్చితినీ ॥నీవెంతటి॥

వ॥ ఛీ! మూర్ఖురాలా నీవు నాడే వ్యాఘ్రమున కాహారమై యుండెడిదానవు పాపంబని పులిని సంహరించి నిన్ను బ్రతికించి నాయింటికి దెచ్చి పెట్టుకొనినందులకు నాకుమారునకుమృత్యుదేవతవైతివిఅక్కటా యీ భీకర కృత్యంబు జేయుటకు నీమనుసెట్లొప్పెను దుర్మతీ. (అనిన విమల ఖిన్నురాలైన)

స॥ శ్రీచెాలమద్దివాసా - శ్రితపోష శ్రీనివాసా ॥ శ్రీ ॥ నీమాపు మాయందుననూ - నేడెందుబోయెనో యికనూ ॥ శ్రీ ॥

వ॥ పాపిష్టురాలా నాతనయుడును కుమార్తెయును నన్నెడబాసిరనియు యేమొ వగలేడ్పు లేడ్చుచున్నావే యేదో మాబిడ్డల జూచుకొనుచు పొద్దు గడుపుకొమ్మనిన యిట్టి పాపకార్యం బొనర్పనగునా చేతులార నాకొడుకును నీపొట్టన బెట్టుకుంటివె దురాత్మురాలా.

(యిట్లు దుఃఖింపుచుండ రాజభటులువచ్చి రాంజెట్టితో)

బఫూన్-వ॥ రాంజెట్టిగారు మీకుమారుం డేవిధంబున చనిపోయి యున్నడు నిజంబుగా తెల్పుము.

రా-వ॥ అయ్యా యేమని తెల్పుదు యీపాపిష్టిముండ నాకుమారునకు మందుపెట్టి చంపినది యేమొ బ్రతుకనిమ్మని మాయింట నుంచినందులకు యీలాటి ద్రోహ మొనర్చియున్నది దేవా.

బఫూన్-వ॥ యేమీ యింతకార్యము జేసియున్నదా మంచిది అటులైన యీమెకు ప్రాయశ్చిత్త మగును గాని మీరు న్యాయస్థానమునకు పొండు మేముగూడ వచ్చెదము నీబాలుని మృతకళేబరమును వైద్యశాలకుంబంపి బ్రతికింపగలము విషమిచ్చిన యీ మీదాసిని గొనిపోయి బందిఖానలో నుంచెదము.

(భటులు విమలనేతులు గట్టుకొనిపోయి చెరసాలలోవేతురు)

(కనకసేనుని సభ) కీర్తివంతుతో

కనక-వ॥ సుకీర్తి మీయజమానియగు జయసింహు డింతవరకైన రాకయున్నాడు కారణం అదియుండగాక నీపురంబున యెట్టి అన్యాయంబులు లేక సుఖంబున నున్నవారేకద.

సు-వ॥ కనకసేనభూపాలా మన జయసింహుడు యా కర్వారసేనుని వధియింపనిది రానేరడు కాబట్టి యింతకాలము జర్గినది యిట్టి నగర

మన నెట్టిసంగతి యెటువంటిదో తెలియక యున్నది అయిన రాగలదు మన పురంబునంగల్గు సమాచారంబు జెప్పుటకయ్యె ఆదో మన వుజూర్ వచ్చుచున్నాడు చూడుము.

కనక-వ॥ సరి మంచిది రానిమ్ము. (అంతలో వుజూర్ వచ్చి)

వు-వ॥ సునో మహరాజ్ ఆరాంజెట్టి బడాజోర్ బేటాకి ఆల్లదాసి యిసం బెట్టినాదట అపుడే అన్ని దీస్కాని దవాఖానాకు అయిద్యుని కొప్ప జెప్పినారట యిది తాము పరిశీలన జేసి దాసిదానికి శిక్ష యియ్యాలె మహరాజ్ రాంజెట్టివగైర అందరు మీకు జెప్పుకుందామని అచ్చివున్నారు ఆవలవుండి మీ సెలవుకై జూస్తువున్నారు మహరాజ్.

కనక-వ॥ సుకీర్తి వింటివే ఇదియెంత పాపకార్యము ఇపుడే నీవు న్యాయవాదులను యీరాంజెట్టి వగైరాల నిట్టిసభకు రావించి పరీక్షించి శిక్ష యివ్వవలెను.

వు-వ॥ రాజేంద్రా అట్లులనే గావించెదను.

(అంత న్యాయవాదులను దేవదత్తుడు సుందరుడు ప్రవేశించి రాజుకు నమస్కరింతురు)

దే-వ॥ మహాప్రభో నమస్కారములు.

కనక-వ॥ న్యాయవాదులారా వర్ధిల్లుడుగాని యీరాంజెట్టి కుమారునికి విషమిడినసంగతిలో మీరు న్యాయ అన్యాయములు పరీక్షించి శిక్ష ఇవ్వవలయును.

దే-వ॥ చిత్తము రాజన్.

కనక వ॥ సుకీర్తి ప్రథమం రాంజెట్టిని రావించి యాతని యభిప్రాయ మడుగుము.

సు-వ॥ మంచిది (అని సేవకునిగని) వుజూర్ రాంజెట్టిని బిల్వుము.

వు-వ॥ అచ్ఛా బిలుస్తా వుండా. (అని పిలుచును)

రాంజెట్టి హాజరుహై రాంజెట్టి హాజరుహై రాంజెట్టి హాజరుహై

రాం-వ॥ సర్కారు హాజరు వున్నాను.

సు-వ॥ రాంజెట్టి నేనడుగబోవు ప్రశ్నలకు నీప్రమాణ పూర్వకముగా నిజముగం జెప్పగలవా.

రాం-వ॥ నిజముగా జెప్పగలవాడను.

సు-వ॥ నీతండ్రి పేరేమి.

రాం-వ॥ నాతండ్రి పేరు భీంజెట్టి.

సు-వ॥ నీకెంతవయస్సు గలదు.

రాం-వ॥ శతార్థము.

సు-వ॥ నీకులమేమి.

రా వ॥ పౌండ్రకులం

సు-వ॥ వ్యాపారమేమి సేయగలవు

రా-వ॥ కులవృత్తియె.

సు-వ॥ నీకుమారుండెట్టుల మృతినొందెను.

రా-వ॥ మాయింటనుండు దాసివలన.

సు-వ॥ యాదాసి యెటులజంపెను.

రా-వ॥ విషముపెట్టి చంపినది.

సు-వ॥ చూడనిది నీకెట్లుగుర్తు సాక్షులెవరైనంగలరా.

రా-వ॥ యెవ్వరననేల నాచిన్నభార్యయే సాక్షి యీవృత్తాంతం బదియే చెప్పినది.

సు-వ॥ నీపెద్దభార్య యేమైన చెప్పియున్నదా.

రా-వ॥ యేమియుం జెప్పలేదు.

సు-వ॥ యాదాసిని యెక్కడ గొనితెచ్చితివి.

రాం-వ॥ అయ్యా నేనొక్కదినము నరణ్యములో దిరుగుచుండ నామెను యొక వ్యాఘ్రము తరుముకొని పోవుచుండ నావ్యాఘ్రమును సంహరించి అప్పడామెను మాయింటికి దీసుకొనివచ్చి దాసిగా నుంచుకొని నాతల్లి సమానిగా జూచుచుంటినిగదా.

సు-వ॥ యాదాసి మీయింటనుండి యెంతకాలంబైనది.

రా-వ॥ సుమారు వొక్క సంవత్సరంబైనది.

సు-వ॥ యాదాసి నిజనివాసము నీకుతెల్సునా.

రా-వ॥ యేమొ నాకుతెల్యదు.

సు-వ॥ యెన్నడైన యడిగియుంటివా.

రా-వ॥ అడిగినప్పడెల్ల దుఃఖించుచుండుటచేతను నడుగమానితిని.

సు-వ॥ అటుల చెప్పకపోవుటనుచుంచి నీకుసందేహమొదవలేదా.

రా-వ॥ నాకేమి సందేహమొదవలేదు.

సు-వ॥ యెందుకని.

రా-వ॥ యీయామె నడువడిని బట్టి మహాపతివ్రత సిరోమణియని తల్లివలె భావింపుచుంటిని నేడేలనో యిట్టిబుద్ధి యీయామెకు బుట్టినది యిట్లు జేయునని కలనయినను తెల్యలేదు.

సు-వ॥ సంవత్సరమునుండి నీవామె దుర్గుణము లేమైనాకనిపెట్టితివా

రాం-వ॥ నేడిట్లు విషము బెట్టినదియుందప్ప యింతవరకు నామె యందెట్టి దుర్గుణములు గలిగి యుండలేదు మహా సుశీలయే.

సు-వ॥ ఆమెకేపని యేర్పాటు జేసితివి.

రా-వ॥ నాకుమారులను జాగ్రత్తగా కాపాడుచుండుటకు కుడువం బెట్టుటకు బడికి తోలుడముకు మళ్ళి గొనివచ్చుటకేర్పాటుజేసితిని వీటిం దప్ప రెండోపనియుం జెప్పలేదు.

సు-వ॥ సరి అట్టిమనిషి విషమెట్లు సంపాదించినది తెల్సుకుంటివా.

రా-వ॥ తరుచుగా రోగిష్టులామెకడకు వచ్చుటచేత వారి కౌషధ మూలికలు జెప్పటచేతను.

సు-వ॥ యీవ్యాపారము వలన నేమైన ధనమార్జనంబు జేయు చుండునా.

రాం-వ॥ యెవ్వరేమిచ్చినా దీసుకోవడములేదు.

సు-వ॥ నీయిద్దరి భార్యల నేకవిధముగా జూతువా.

రా-వ॥ సమానిగనే యెంచుచుంటిని.

సు-వ॥ నీపెద్దభార్య నామంబేమి.

రా-వ॥ సత్యాబాయి.

సు-వ॥ యీవిషయము ఆమెనుగూడ తెలుసుకోనవలెను.

దే-వ॥ అట్టిపని సత్యాబాయినడుగ నేమిప్రయోజనము యీయామెకు యేదియు నేర్పాటు లేదుగదా.

కన-వ॥ యెరుకలేకుండిన నేమీ యీయామె వాంగ్మూలముగూడ విన వలయును. రాంజెట్టి యికనీవు వెళ్ళవలయును.

సు-వ॥ పుజార్ సత్యాబాయిని బిల్వుము.

పు-వ॥ సత్యాబాయి ఆజర్ హై సత్యాబాయి ఆజర్ హై సత్యా బాయి ఆజర్ హై.

సత్యాబాయి వచ్చినిల్చిన

సు-వ॥ అమ్మా నీనామంబేమి.

స-వ॥ సత్యాబాయి.

సు-వ॥ నీకుమారుడు మరణించుటకు కారణంబేమి.

స-వ॥ నాపూర్వజన్మకృత పాపముచేతను,

సు-వ॥ నీయింటిలోనుండు దాసి యిదివర కెన్నడేని తప్పిత కార్యములు జేసియుండునా.

స-వ॥ యెన్నడేని తప్పిత కార్యములు జేయలేదు.

సు-వ॥ నీపుత్రునకు యెవ్వరు విషము బెట్టిరని నీకు నమ్మకం.

స-వ॥ నాకెవ్వరియందనుమానము లేదు. అట్టి పుత్రదుఃఖ మాపు కున్నదాన యికనన్ను విడువుడు.

సు-వ॥ యికనీవుబొమ్ము. (పుజార్ పద్మాబాయిని బిల్వుము)

పు-వ॥ పద్మాబాయి హాజర్ హై. (పద్మాబాయిని సుకీర్తిగని)

సు-వ॥ అమ్మా నీనామంబేమి.

ప-వ॥ పద్మాబాయి.

సు-వ॥ నీసవతి పేరేమి.

ప-వ॥ సత్యబాయి.

సు-వ॥ మీయిద్దరికి సంతతి కలిగినదా లేదా.

ప-వ॥ నాసవతికొక్క కుమారుండు నాకొక్క కుమారుండు గలడు.

సు-వ॥ నీసవతికొమారుడు యెవరివల్ల మరణించినడో నీవు తెల్పు దువా.

ప-వ॥ తెల్పుదును.

సు-వ॥ యెవరివలన యేమిటి వలనను మృతినొందెను.

ప-వ॥ మాయింటనుండు దాసి విషమిచ్చుటవలన మృతినొందెను.

సు-వ॥ యామె విషము బెట్టినదియు నీకెట్లు దెల్సును.

ప-వ॥ పిల్లవానికి అన్నములో పాలుగలిపి తినిపించగా నేనుచూచి యుంటిని పిదప నరఘంటలోగానే యాబాలుండామె ముందరనే నురుగులు గ్రక్కుచు మరణించెను.

సు-వ॥ నీవెప్పుడైన సవతి పుత్రునకు అన్నము పెట్టుచుంటివా.

ప-వ॥ సమయము వచ్చినప్పుడు.

సు-వ॥ యెక్కువేళనేనా (పద్మాబాయి ఆలోచించుచుండ)

సు-వ॥ తత్క్షణమే జవాబు యిచ్చుచుండగావలయును.

ప-వ॥ వొకవేళనే కుడువం బెడుదును.

సు-వ॥ నీసవతినీవు స్నేహితముగానే యుందురా లేక కలహించు కొందురా.

ప-వ॥ ఇద్దరము కలసి మెలసి యుందుము.

సు-వ॥ ఆదినమున నీపుత్రునకు ముందుగా దినిపించితివా నీసవతి పుత్రునకా.

ప-వ॥ నాసవతి పుత్రునకే ముందుగా తినిపించితిని (ఆ లేదు లేదు)

దే-వ॥ పాపము యీయామె మాటలాడుటకు తడబడుచున్నది యిక రెండవప్రశ్న విచారింపవలదు.

కనక-వ॥ వారల మరలవిచారించుటకనుజ్ఞ లేదు. యిప్పుడే సర్వము నడుగవలయును.

సు-వ॥ పద్మాబాయి నీకుమారునికన్న ముందు నీసవతి పుత్రునకే తినిపించి యుందువుగద మరి యిద్దరిబాలుల కొకసారి ఆనాడుతినిపించని కారణంబేమి.

ప-వ॥ ఆపుత్రుడానాడు నావద్ద లేనందున ఆ వొక్కనికే తినిపించితిని.

దే-వ॥ ఓహో యింక యీయామె తొందరపడుచునే యున్నది యిక ప్రశ్నజాలించుడు.

కన-వ॥ చాలుచాలు పద్మాబాయి యిక నీవుపొమ్మా.

సు-వ॥ పుకార్ రాంజెట్టి దాసిని బిల్వుము (బిల్చుట)

పు-వ॥ రాంజెట్టిదాసి ఆజర్ హై. రాంజెట్టిదాసి ఆజర్ హై.

(అన్నంతలో భటులు విమలాదేవి చేతులుగట్టి పట్టుకవచ్చి నిలువం బెట్టుదురు)

సు-వ॥ అమ్మా నీనామంబేమి.

వి-వ॥ యిప్పుడు దాసి యనుచున్నారు.

సు-వ॥ నీవెక్కడ యుండుదానవు.

వి-వ॥ రాంజెట్టిగారి గృహంబున.

సు-వ॥ అంతకుము న్నెచ్చట యుండుదానవు.

వి-వ॥ అదియు మీారడుగకుడు.

సు-వ॥ నీవు మేఘవాహానునకు విషము బెట్టినది నిజమేనా.

వి-వ॥ అదియు నాకుం దెలియదు.

సు-వ॥ ఆబాలుండు విషమువలననే మృతినొందియుండవచ్చునా

వి-వ॥ కాకోలును లేకయున్న తటాలున గతజీవుండగునెట్లు.

సు-వ॥ యెవ్వరైన విషముబెట్టినది నీకుం దెల్యునా.

వి-వ॥ నాకుం దెలియదు.

సు-వ॥ నీకు నిజముగా దెలిసియుండవచ్చును తెల్పుము.

వి-వ॥ కన్నులతో జూడని దేమిజెప్పుదును.

సు-వ॥ నీవే మందుబెట్టి చంపితివోయని యీ నేరము నీయందే నిలిచియున్నది దీనికి నీవేమందువు.

వి-వ॥ నేను బెట్టలేదు యేదియు నాకుం దెలియదు.

సు-వ॥ పద్మాబాయి నిన్నెప్పుడైన కోపించునా.

వి-వ॥ యెన్నడును లేదు.

సు-వ॥ ఆదినము ప్రాతఃకాలమునుండి నీ వెక్కడ నుండితివి.

వి-వ॥ రాంజెట్టి పుత్రుల నెడబాయకనే యుండితిని.

సు-వ॥ నిత్యము బాలుల కెవ్వరు అన్నము కుడువ బెట్టుదురు.

వి-వ॥ వొకనాడువారు వొకనాడు నేను సమయాసమయము.

సు-వ॥ ఆదినము సత్యాబాయికొడుకున కెవ్వరు దినిపించిరి.

వి-వ॥ పద్మాబాయి తినిపించి యున్నది.

సు-వ॥ యిద్దరి బాలురకేనా లేక వొక్కనికేనా.

వి-వ॥ వొక్క మేఘవాహానునికే దినిపించియున్నది.

సు-వ॥ యిద్దరికి తినిపించక వొక్కనికి తినిపించిన కారణమేమి.

వి-వ॥ యిద్దరిబాలుల బడికి తోలుకొని పోవుచుండగా పద్మాబాయి పుత్రుండు నేను బడికి రానని వెళ్ళిపోయిన వెనుక పద్మాబాయి యింటికివచ్చి కోపంబున నాసవతికొమారుని యందున్న ప్రేమ నాకుమారునియందు లేదాయని నన్ను తీక్షణ వాక్యములు బలుకుచుండ నంత మేఘవాహానుడు ఆకలి యగుచున్నదన విని నాయనా అన్నము పెట్టెద రారాయని యింట్లకు దోడుకపోయి అన్నము దినుపించుక వచ్చి మేఘవాహానుని నాకొప్పగించి బడికి తోలిరమ్మని పలికి పోయినది.

సు-వ॥ అట్టి మేఘనాథుండు అటుశీమ్మాట తొంతవరకుమూర్ఛిల్లెను

వి వ॥ పాపుఘుంటకే మూర్ఛ నొందియుండెను.

కనక-వ॥ మంచిది సుకీర్తి నీవట్లుండుము (అని విమలతో) దాసీ యీ నేరము పద్మాబాయిదే యనుకోవలయునుగదా.

వి-వ॥ మహానుభావా నేజూడనిది విననిది యెటుల నిజమని యందును.

కన-వ॥ అదట్లుండనిమ్ముగాని నీనామంబెందులకు దెల్పవు.

వి-వ॥ ఆమాట నన్ను మొదలే యడుగకుమంటిని.

కనక-వ॥ నీపేరు నీవు జెప్పుకొనుట కేమిభయము అటుల జెప్పని యెడల తప్పు లెక్కింపబడును.

వి-వ॥ తప్పున్న యెడల దండింప విధింపుడు.

కన-వ॥ శిక్ష యతికఠినమైనదిగదా.

వి-వ॥ కఠినమైనను తమకేదురెవ్వరు (అని కనకసేనుని బాగా వీక్షించి తనలో) యీతని మాటలు వినగా నా ముద్దుల పట్టియగు నాకనకసేనుడు జ్ఞప్తికివచ్చుచున్నాడు (అక్కడా యెక్కడి కనకసేనుండు)

(అంత వైద్యుడు మేఘవాహనుని తోడ్కొనివచ్చిన కనకసేనుండు గని వైద్యునిలో)

కన-వ॥ వోయివైద్యుడా యీకుర్రవాడెవడు కావోలు

వై-వ॥ విషముచే జచ్చిన రాంజెట్టి పెద్దభార్య కొమారుండగు మేఘవాహనుడు.

కనక-వ॥ యిదియేమి చిత్రము విషమువలన నిర్జీవితుండైన యీ బాలుండు మరల యెట్టుల జీవించెను.

వై-వ॥ అయ్యా మేమనేక ప్రయాసములకోర్చి యొక ప్రభావంపంబున యీబాలుని బ్రతికించితిమి దేవా.

కన-వ॥ సుకీర్తిచూచితివే దైవము మనకు తోడయ్యె యీబాలుని బ్రతికించెను యిది యెంత మహా సుదినమనవచ్చును మనమందరివాజ్మూలము గొనినది యంతయు నిష్ప్రయోజనం కావున యీబాలు నడిగిన సర్వము తేటపడగలదు. ప్రశ్న జేయుము.

(అని సుకీర్తి మేఘువాహనుని దగ్గరకుగొని)

సు-వ॥ అబ్బాయీ నేటిదినంబున యీదాసీ నీకుఅన్నములో యేమిగలిపి తినిపించెనో నిజముగా దెల్పుము.

మే-వ॥ పాపము ఆనాటిదినము యీమె బువ్వనే దినిపించలేదు మాపినతల్లియే నన్నొక్కరునిదోడుకొనిపోయి పాలలో నేదియో కలిపి ఆట్టిపాలు అన్నము కలిపి తినిపించినది అప్పటినుండియే నాప్రాణము తల్లడిల్లుచు కడుపులో మండుచు స్మారకము దప్పియు నేలంబడితిని యింతియే కాని మరేమియులేదు.

(అప్పుడందరు పద్మాబాయి ముఖంజూచుచు చప్పట్లు వేయుదురు. అంత కనకసేనుడు)

కన-వ॥ సుకీర్తి వింటివే సర్వంబున్ తేటపడినదిగదా యిక నీవిట్టి తీర్మానము యిట్టి సభవారందరికి వినిపించి యీపద్మాబాయిని శిక్షించుటకై భటుల కాజ్ఞాపించుడు.

సు-వ॥ ఆర్యులారా యీపద్మాబాయి తాను మేఘువాహనునికి విషంబుబెట్టి యీ దాసిమీద నేరారోపణము జేసినది దైవకృపవలన యీబాలుండు బ్రతికివచ్చి జరిగిన సంగతి నిజంబుగా బల్కియున్నాడు వింటిరా.

(అని పుజారీ నింగని)

పుజారీ చూచెద వేము యీపద్మాబాయిని బాగా శిక్షించి యము పిదప చెరసాలలో యుంచవలెను.

పు-వ॥ చల్ చల్ తేర బద్మాషీమారొ ఆరెనడువు మాకీ యెంత గోసాకి జేస్తివి.

(అని పద్మాబాయిని చేకొని పోదురు)

కన-వ॥ (తనలో) యీమె దాసిదానివతు తోచబడుతులేదు మాతల్లి యేమోనని యీశబాడుముచున్నది అకటా యింక యెక్కడి మాతల్లి మున్నె సముద్రంబునన్ బడిపోయెనుగదా యెకవేళ బడక పోయినను కౄరుడిందాక బ్రతుకనిచ్చునా (అని ప్రకాశముగా) అమ్మా నిన్ను నేకొన్ని ప్రశ్నలడుగ గోరితిని యేమన నీవా రాంజెట్టి నరణ్యమున గానంబడుట కేమికారణం తెల్పుము.

వి-వ॥ దిక్కుమాలినదాని నగుటవలన.

కనక-వ॥ నీకుమారులుగాని బంధువులు యెవ్వరైనంగలరా.

వి-వ॥ యెందరున్నా నిర్భాగ్యురాలి నగుటచే అందర్ని గోలు పోయితిని.

కన-వ॥ నీకేమి కష్టములు గలిగినవో తెలుపుము నాకు సాధ్య మైనంత వరకు నీకు సహాయముగా జేసెదను.

వి-వ॥ చావసిద్ధమైయున్న నాకేమి సహాయ్యము గావలెను.

కన-వ॥ అమ్మా ఇట్టిరాజసభయందు వ్యతిరక్తముగా బలుక రాదు నిజముగా బలుకుము.

వి-వ॥ (తనలో) యేమీ యీరాజపుత్రుని వాక్యంబులు వినగ కనకసేనుని వాక్యంబులవలెనే వినబడుచున్నదే నిశ్చయముగా కనక సేనుడే కాబోలు యేమి అయ్యో యెక్కడి కనకసేనుడు అయినను నావృత్తాంతంబును దెల్పిన సర్వము తేటపడగలదు తెలిపెదగాక.

వి-వ॥ తండ్రీ క్షత్రియ సంజాతురాలనై సకల సంపదలచే తుల దూగుచుండు మదియ్య మనోహరుని కర్ణారసేనుండు సంహరించి నా కుమారుని పుత్రికను అరణ్యముపాలు జేసి నన్ననేక బాధలం బెట్టు కడ పట నెట్టులనో తప్పించుకొని వచ్చి యీ రాంజెట్టియింట నున్నదానను తండ్రీ అనిన కనకసేనుడు పయింబడుట.

కనక-వ॥ హాతల్లీ నీకెంత దుర్దశ ప్రాప్తమైనదితల్లీ (అనివడును)
(విమల విస్మయమొంది తనలో)

వి-వ॥ యేమీ వీవు నాకనకసేనుడేవా హాకుమారా కనకసేనా నీవు జీవించి యున్నవాతండ్రీ మీమీది యాశ నిరాశనే జేసుకొని యున్నదానగదా కొడుకా (అని మోమున మోముజేర్చి ముద్దు బెట్టు కొనును)

యిందుపురికి దైలాగ్

కన॥ అమ్మరో నీవెంత ఆయాసపడితివో — మమ్మ బాసియు నెట్లు మహిలో బ్రతికితివో ॥అమ్మ॥

వ॥ జనని యాకర్ణారుని బారినుండి యేవిధమున దప్పించుకొని యీదాసితనమున నెట్లు బాలుపడితివి తల్లీ.

వి॥ తనయూనాశ్రిమలూ యెంతని విన్నవింతును - ననుబోలు దు ర్భాగ్యులును యెవ్వరిలలోను ॥తన॥

వ॥ కుమారా నాకష్టముల కంత మేలేదుగదా యాకష్టారునిబాధకు నోర్వక సముద్రములో బడినను యొక బెస్తవాడు వలవేసి నన్నుందీసి కొని తనయింటికి దెచ్చి బహుశ్రమల బెట్టిన వానిం దప్పించుకొని వచ్చి యరణ్యములో నుండ నొక వ్యాఘ్రంబునన్ను గవయగరాగా యారాంజెట్టి యావ్యాఘ్రంబును సంహరించి నన్ను తల్లివిధంబున గాపాడుచుండ నింతయ్యెను గాని నాయనా మీరెంత కష్టముల పాలయి తిరోకదా మన తార యెందున్నదిరా తండ్రీ.

కన-వ॥ హా జననీ నీవెంత కష్టము లనుభవించినదానవు యొకరి కష్టములు యొకరము జూడకుండితిమిగదా తల్లీ.

క॥ మాకష్టంబులు నీకేమని తెల్పవలయును - గాకదీరునెపూర్వా కర్మానుభవములుసూ ॥మా॥

వ॥ అమ్మా మమ్మరణ్యంబున సంహరించిరండని భటులను నంపిం చినవారు మాయెడ కరుణగలవారై విడిచిపోయిరి ఆవెనుక భగిని దాహపీడితయై మూర్ఛిల్లి యున్నఁ జూచి యేను జలంబులుఁ దెచ్చెద నని పోయి మళ్ళివచ్చి చూడగా నచట గానంబడనందున యా కాంతా రంబంత వెదకుచు రాగా నిట్టిరాజ్యంబు లభించినది యింతవరకు నా భగిని యెందున్నదో గానలైతినిగదా.

వి-వ॥ హా తనయా తారా నీవెందు బోయితివి నిన్నుయేమృగము భక్షించెనోకదా తల్లీ.

వి॥ శ్రీచోలమద్ది శ్రీలక్ష్మీశుని కృపయెటులో - తోచదేమికము దాలోచన గనుమదిలో॥

వ॥ కుమారా నీభగినియగు నాకూతురు గనిపించకయున్న యిక నేబ్రతుకగల దాననా నిన్నుగని కొంత ధైర్యము నొందితినిగాని తారను యెట్లు గాంచనగును తండ్రీ.

కన-వ॥ తల్లీ దుఃఖింపకుము యేయిప్పుడే నలుదిక్కులకు భటుల వెదకబంపెదను గాని యికనీవు చింతమాని యుండవలయును యిపుడే స్నానంబాడి శుచి వస్త్రములు ధరించి భోజనంబు జేయుము (సుకీర్తి నిం గని) సుకీర్తి జయసింహుడు కష్టారుని పైకి యుద్ధంబునకేజని యింతా

రాడాయెను నాతని కడకు భటుల నంపించి నాభగినియైన తారను యే నరణ్యంబులో యెడబాసి వచ్చితిని అట్టి అరణ్యంబులు వెదుక భటుల నంపుము.

సు-వ॥ రాజేంద్రా అటులనే దోలించెద. (అని నిష్క్రమింతురు)

తారా జయసింహుడు - ప్రవేశం

తా-వ॥ మహాశయా మనమింకా నెంతదూరమేగవలయునుయింత నడచినను గ్రామంబు రాకయున్నదిగదా.

జ-వ॥ పుత్రీ చెంతకే జేరవచ్చితిమి యించుక శ్రమయనక కాలు సాగింపుము.

(అంతలో సేవకుడువచ్చి) డైలాగ్

సే॥ వందముల్ రాజేంద్రా - వరసద్గుణసాంద్రా - పదివేలా॥ వం॥ యిందుమీరలే తెంచినసుండియు - నెదిరిచూచు చుంటిమిమీకొర కై - యెందుకొరకు నింతకాలహరణము - దేమొ తెల్పవలయును కరు ణించియు ॥వంద॥

వ॥ కావున మహీపాలా మీరిన్నిదినంబులనుండి మననగరంబు జేరరాని కారణంబేమి స్వామీ.

జ॥ క్షేమమే మనరాజ్యమునా - యేమికొరత గలుగబోక జన ములు ॥క్షే॥ యేమొనీవుతొందరపాటునజెటా- కేగుచున్నవాడ వోమదీ కేమి సందియంబు నొందకనుబల్ - ప్రేమబూనిసర్వము నెరిగింపుము॥ క్షే॥

వ॥ సేవకా వర్ధిల్లుముగాని నీవందేగుచున్నాడవు మనరాజ్యంబు క్షేమమేకదా.

సే॥ యుర్వికాంతుడైనట్టి - యుదయసేన సుతుడు కనకసేనుడు॥ యు॥ నిర్వికార నిశ్చయమొక్కరేయుగా-నెదిరిచూచుచుండె మీకొరకై సర్వమెరుగగలరు మీరలా వాస్తవ్యమంత పురికి రండు పోవము॥

వ॥ కావున మన కనకసేనుండు మనపురంబుకొచ్చి యున్నవాడు తన భగినియగు తార విషయమయ్యి యనేక భటుల వెదుకం దోలించిన వాడు వింటిరా.

జయ-వ॥ యేమీ కనకసేనుడు మనపురంబు జేరియున్నవాడా ఆహా బాలికామణీ నీ సోదరుండగు కనకసేనుడు నీకొరకై నిరీక్షింపు చున్నవాడట వింటివా.

తా-వ॥ యేమి మాకనకసేనుండు యీపురంబులో యున్నవాడా అహో నాభాగ్యము నేటికిఫలించెనుగదా.

జ॥ సేవకయిక పదుపదమా - శీఘ్రమున మనపొరిజేర బోవు దము ॥సే॥ యీవసుంధరందు చాలవద్దివు - రీతిదైన దీనలోక పాలునీ భావమందున మనసునిల్పి నిరతము - భక్తినెంచ మేలుజేయుచుండు నే॥సే॥

వ॥ కావున మనమిచ్చట దడవుజేయు టెందుకు మన పురంబు జేరబోదము పదము.

సే-వ॥ అమ్మా తారాయనవారు యీరేనా ఆయోధ్యాతల్లీ నీకొర కై సీతమ్మలుంగారు అఘోరించుచున్నవారు అదియుంగాక మాతల్లియగు విమలాదేవి గూడం జేరియున్నది అమ్మా.

తా-వ॥ సేవకా మాతల్లిగూడ వచ్చినదా అహో నేటికి మాకష్ట ములు దొలంగెను.

సే-వ॥ రాజేంద్రా తామేగినదాదిగా కనకసేనుడేరాజ్యభారంబు వహించి యున్నవాడు వింటివా మహాత్మా.

జ-వ॥ మంచిదిగాని అవురా విమలాదేవిగూడ వచ్చినదా అటు లైన నింక తడయరాదు యిదేతార పోదాము రమ్మా.

(అని పోదురు అంత కనకసేనుడు సుకీర్తితో)

క-వ॥ సుకీర్తి తార జయసింహులకై తోలించిన భటులింతవరకు రాకయున్నవారుగా.

సు-వ॥ రాచకుమారా మీరు బల్కునంతటనే జయసింహుడు తారాయుతము వచ్చుచున్నవాడదో కనుము.

(అంతలో జయసింహుడు తారయుంజేరి తార తల్లిపైంబడి దుఃఖిం చును జయసింహుడు కనకసేను నలుముకొని)

జ॥ కనకసేన యనేకమైన కష్టములు నేటికి దొలిగేనా ॥ క ॥ అనఘ మిముగాంచనాదుమన - మునకు ముదమాయె నింతలోనా ॥క॥

వ॥ హా కనకసేనా మీరెంతటి కష్టములపాలైతిరి అయినను భగ వత్కటాక్షము వలనను మీరు మువ్వురు గూడితిరిగదా.

కనక॥ అనుభవము లెవ్వరైన గానీ - యవియు దప్పించు కోరు పూనీ ॥అ॥ వనజగర్భుండు మాదునొదుటా - వ్రాసియుండ బోలు మొదటా ॥అ॥

వ॥ జయసింహభూపాలా జర్గినదానికై చింతించిన నేమిలాభము యేను మీనగరంబునకొచ్చి యున్నది నాకు జయంబయ్యెను యిదంతయు మీఆశీర్వాదంబేకదా.

(విమల బిడ్డయగు తారతో)

వి॥ బాలికా నీవు మమ్మెబాసీ - చాల శ్రమపడితి వెంతరోసీ ॥ ఫాలమున వ్రాసెనే మొయిట్టి పాట్లంబడయుదువనీపరమేష్టి ॥బా॥

వ॥ బిడ్డా మనమెల్ల కష్టములబాసి యుంటిమిగాని సర్వేశ్వరుండు మేలొసంగునో లేదో కదా.

తా॥ అమ్మరో కాగల కార్యములూ - నయ్యె తీరినవి యనుభవములూ ॥అ॥ యిమ్మహియందు కేమియున్నా - దమ్మఖిను మింతకన్నా మిన్నా ॥అమ్మరో॥

వ॥ జననీ యెవ్వరికైనను కష్టములు కొంతవరకేకాని యెల్లకాలముండబోవుగదా కాబట్టి నేటికి కష్టాలు దీరిపోయినవిగదా యికనీమది చింత నొందకుము తల్లీ.

కన॥ అక్కరో నిన్నరణ్యముననూ - యొక్కతిని విడచిపోయి యేనూ ॥అ॥ యెక్కడను జలములు గానకనూ - చిక్కులఁ బడితిని ఘనముగనూ ॥అ॥

వ॥ భగినీ యిట్లు నిన్నొడబాసియు నేనీపురంబు జేరి యుంటిని గాని నీవెట్ల యీజయసింహుని కగుపడితివి.

తా॥ తమ్మీ నీకేగినంతలోనా - తస్కరుండొచ్చి కాననమునా॥ త॥ యమ్మహకాళికాలయమునా - కవుడుగొనీ పోయె వేగమునా ॥త॥

వ॥ అట్టి చోరుండు నన్ను కాళికాదేవికి బలియివ్వగా నీ జయసింహుడొచ్చి వాని సంహరించి నన్నిటకుగొని తెచ్చెను తమ్మీ.

కన వ॥ అహాహా అక్కా నీకెంత కష్టంబు జరిగినది మన జయసింహుడు ఆపత్కాల బాంధవుండు అగును గదా.

కన॥ భూమిపాలాత్మజా నీవలనా - మేమికదరి జేసితిరి ఖిలలోనా ప్రేమగొనియు కన్నతండ్రివిధమూ - ప్రీతి జేసితిరి యెంతో ఘనము॥భూ॥

వ॥ అహో మహాత్మా యిట్టి మీయుపకారంబునకు ప్రతి యుపకారమేమి యొనర్పగలము మీ ఋణము మాకెన్నాళ్ళకైనం దీరదుగదా నీవు మాతండ్రివంటివాడవని యెల్లకాలము నిన్ను దలతుము.

జ॥ ధారుణీయందు చాలమద్ది - శౌరికీ సాటిదైవమెద్ది ॥ధా॥
మాధ్వజనకుని కృపారసమునా - మనకు మేలాయనెంతయిలనా ॥ధా॥

వ॥ కావున కనకసేనా మనకందరకు పరంధాముడే తండ్రియు గదా వాని కృపలేనిది మనమేమి చేయగలవారము సరి నేటికి మనకు మేలయ్యెగాని యాక్రూరసేనుని పైకి దండెత్తిపోయి వానిని బరిమార్చి లోకబాధ మాన్పవలయును పిదప నీవు రాజ్యంబున కధిపతివయ్యి సకల జనుల రక్షింపవలయును.

కన॥ సరిమంచిది యిదేమాతల్లిని మాభగినిని దోడ్కొని సైన్యం బుతో మన్నగరంబున కరుగవలయును సైన్యంబు సిద్ధపరుపుము.

జ-వ॥ యిదువరకే సైన్యంబు సిద్ధపరచి యున్నవాడా యిదే రథంబునందు విమలాదేవి తారయుతేము నీవు గూర్చొనుము యేను రథం బును దోలువాడా (అని వెళ్ళుదురు) (అక్కడ క్రూరసేనుడు)

క్రూ-వ॥ వరేశూరా యేమో రణభేరి వాయిద్యంబులు వినబడు చున్నవి యెవ్వరేని శత్రువులు మనపైకి దండెత్తి వచ్చిరా యేమి తెల్పుము. యేమీ వాడెవండు కాబోలును.

శూ-వ॥ అయ్యా కనకసేనుడు జయసింహుని సహాయ్య మొనర్చు కొని వచ్చుచున్నవాడన వింటిని.

క్రూ-వ॥ యెక్కడి కనకసేనుడు మున్నే యరణ్యములో మీరు ఖండించియే వచ్చితిరిగదా.

శూ-వ॥ (తనలో) ఓహో యిదియేమో మోసము సంభవించి వచ్చును దీనికేమి బొంకనగును మంచిది యిదుగో నొకమాట బలికెద గాక (ప్రకాశముగా) రాజేంద్రా అదియు నిక్కమేకాని మేము వార్ధల ఖండించివచ్చినలోడనే యొక తపోధనవంతుడువచ్చి వారిరువురి శిరస్సుల నంచి బ్రతికించినాడని విన్నవారము వింటివా.

క్రూ-వ॥ ఆహా యిదియేమి విచిత్రము మంచిది రానిమ్ము.

(అంత కనకసేనుండు వచ్చి క్రూరసేనుంగని)

కన-వ॥ వరేభ్రష్టా క్రూరసేనా.

గీ॥ ధర్మమును పాడుజేసి యధర్మమునకు ♦ చిక్కినాడవు పందవై చెనటినేడు ♦ కాలరాచెద నిక్షణాను కరుణవీడి ♦ సకలభూపాలులందరు సన్నుతింపా॥

వ॥ ఓరీ దురాత్మా నిర్వక్ర పరాక్రమ వంతుఁడనని బింకము లాడుచు మమ్మెంతో కష్టాల బెట్టితివి యికనీ మదంబడంచి నాయొక్క తండ్రి ఋణము దీర్చుకొనియెదా యిక నట నిల్వుంబడుమురా.

కన్యా-గీ॥ కాలమాసన్నమాయెను గాననీకు ♦ వారివీరులగూర్చుకో వచ్చిసరిగ ♦ నిల్చినంతనే నన్నిట గెల్చితివిటో ♦ జీల్చిచెండాడు వాడనిన్ని క్షణమునా॥

వ॥ ఓరే బాలకా వయస్సున కడు చిన్నవాడవురా అస్త్రశస్త్ర విద్యలింకను చిక్కగా నేర్వవలసియున్నది యిపుడునాపై రణంబున కొచ్చుట తగదు శరణని మరలిపోయితివా మన్నించెద చూడుము.

## డైలాగ్

కన॥ పలువా తులువా నిలువు క్షణంబున నిలుపక నీయొక తల ద్రుంతున్ - బలిమిన జనకుని బట్టివధించిన ఫలమునిపుడె గుడువగ జేసెద నిక ।పలువా॥

గీ॥ బలిమిచేమాదు జనకుని బట్టిచంపి ♦ వదినె మాతృసమంబనక వలచెనన్నె ♦ బాధల్ బెట్టి యడవికి బంపినమ్మ ♦ చిక్కుకష్టాల బెట్టిన బింకమదతూ॥

వ॥ యిట్టి క్రూరచిత్తుండవగు నిన్నుజంపుమని మదీయ్యబాణం బిదే గోడు బెట్టుచున్నది యికనాశరంబుదప్పించుకొనుము చూచెదగాక.

కన్యా॥ నిలుమా నిన్నిట నలతును కనుగొన - దలచితివే నాబల మిపుడున్ - పలుమరు యిటులన్ బలికితె నీయొక బలుకులడతు దివిజులు గనిమెచ్చగా ।నిలుమా॥

గీ॥ నీదు జనకుని జంపిన మాదిరిగను ♦ నిన్నుబిగబట్టి తలగొట్టి నీదుతండ్రి ♦ కడకు నంపింతు నిపుడు తత్క్షణములోన ♦ మద్భుజాదండ కాండంబు చూపగలవే॥

వ॥ ఓరే యర్భకా ముక్కుపచ్చలారని పోరడవు యీ సమర సమాచారము నీకేమిగురుతురా వృధా మరణమయ్యెదవు పొమ్మా.

కన॥ యిటులాడిన పెరచువాడగాను - నీవిటుగాంచుము నావటు బలమున్ ♦ కుటిలాత్మానిన్ గూలగనేసియు ♦ నెటులైనను కీర్తులపై గాంచెదా ॥యిటు॥

వ॥ వరే మూర్ఖా పాపకర్మాండవగు నీకెల్లకాలము జయంబు గల్గునా నేటికినీవు జేయు పాపంబు నిండినది యికనీకు జయంబు చేరదు ఛీ దురాత్మా నీముఖంబు జూడవచ్చునా.

కన్యా॥ యిటుగాంచుము నొక్కటె శరమునని తటకున బడవైచెద నిపుడే - యెటులైనను చాలమద్దిపురిశ్రీ - వటపర్ణాంకుని వాసిగ దలచెదా ॥యి॥

వ॥ యిదే నాశరంబు వచ్చుచున్నది చూడుచూడుము.

(అని శరంబుచేకొని ప్రయోగింప జయసింహుడు అడ్డముగావచ్చి కన్యారసేనునితో)

జ॥ వరే కన్యారా యీకనకసేనుని బాలునిగానెంచియిట్లుబింకము లాడకుము యిదే జయసింహ భూపాలుం గనుగొమ్మా.

కన్యా-వ॥ ఒరే నరాధమా నీవెంతటివాడవురా పులిముంగిట మృగంబు పగిది నాముందరనా నీపరాక్రమము అయినయికరమ్మా నన్ను జయించుమురా.

జ-వ॥ దురాత్మా పాపంబనియెంచక నిష్కారణముగా తోడ బుట్టిన అన్నను నిదిరించి యున్నవానిన్ జంపి మహా పాతకంబు గణించు కొంటివి యిదియు శూరధర్మమా అట్టిపాపంబు నిన్నుజుట్టుకొని వచ్చినది యికనీవు జీవించుట కల్లా.

కన్యా-వ॥ వరే నీ బలశూరత్వముంబు నాకునెలవేయున్నది యెందు కిట్లు బలికెదవు పురుషార్థివేని నన్ను జయించుము చూచెద.

జ-వ॥ అన్నను జంపినదేగాక అన్నభార్యను పిల్లలను మహాకష్ట పెడితివిగదరా కఠినచిత్తా యిందులకు నీకేమి ఫలంబు గలిగినదిరా దురాత్మా.

కన్యా-వ॥ వరే యిదే చూడుచూడుము నాచంద్రాయుధంబున నీతలం ద్రెంచుచున్నవాడా.

(అని కొట్టబోయిన జయసింహుడు కనకసేనునితో)

జ-వ॥ కనకసేనా చూచెదవేమి యీదురాత్ముని జిక్కబట్టి కర పాదములు బంధించి బాగా దండింతామురమ్మా.

(అని యిరువురు వానింబట్టి కరపాదంబులు గట్టివైచి విమలా దేవి పాదంబులన్ బడవేసిన కన్యారుడు విమలంగని)

క్రూ వ॥ తల్లి విమలాదేవి నేజేయుదుర్మార్గము లెల్లను క్షమించి నన్నుబ్రోవుము తల్లీ నీకిదో సాష్టాంగ దండములు.

కన-వ॥ ఛీ దురాత్మా యింకానిన్ను రక్షించవలయునా యిదే చంద్రాయుధంబున సంహారించెద చూడుము.

(అని కొట్టబోవగా విమలాదేవిగని కొమారుని కరంబులుబట్టి)

వి-వ॥ తనయా తాళుతాళుము.

కం॥ అపకారము చేయువచో ♦ నపకారముజేయుటెల్ల ♦ నదిగొప్పగునా
నపకారికి నుపకారము ♦ నెపమెన్నక జేయనీవు నేర్పుమతనయా॥

వ॥ అట్లుగావున కుమారా అతని పాపము అతనినే జెరచును గాని యితని సంహారించి మనమేలా అట్టిపాపము గణించుకోవలయును తండ్రీ యితని కింతయే శిక్ష జాలును యూరొక్కనుము నామాట వినుము.

కన-వ॥ తల్లీ మీచిత్తము అట్లులనే యూరొక్కందును.

జ-వ॥ కనకసేనా మంచిదిగానీ నాయొక్కమనవి యిటువినుము

కన-వ॥ అయ్యా యేమియాజ్ఞ.

## యిరువురికి డైలాగ్

జ॥ సరె నేటికి - జయమయ్యెగాని ॥సరె॥ మరినీవు రాజ్యభారం వహించీ - స్థిరమానసుండవై నరులా పాలింపు ॥సరె॥౧॥

వ॥ కావున మీతండ్రి గతించిననుండి మేము మిక్కిలి చింతాక్రాంతులమై యున్నారము మరల మీసింహాసనము మీరు స్వీకరించి ధర్మప్రపంచంబు నడుపవలయు వింటివా.

కన॥ నామనమునా - కేమిశోచదయ్యే ॥నా॥ యేమనందుమీతో భూమీపాలనాశా ప్రేమయే లేదాయె - పిన్నవాడనయ్యా ॥నా॥

గీ॥ మున్ను నేబడ్డ పాట్లన్ని యెన్నవశమె ♦ నేడు సింహాసనం బెక్క నేమియిదము ♦ మరల మాతండ్రివచ్చునా మానవేంద్ర ♦ భక్త పోషణు డారామ పతియెగాదే॥

వ॥ అక్కటా యీపట్టాభిషేక మహోత్సవమున మాతండ్రియుండి జరిపిన పక్షమున నెంతయో యానందంబుతో నోలలాడు చుందుముగదా.

జ॥ కానున్నదీ - గాకాతీరునే ॥కా॥ ఖైన కార్యంబుకైనీవుచింతా బూనీన లాభంబును లేదునమ్మ॥

వ॥కావున మహాశయా (గతంగోష్ఠినకర్తవ్యం) అనునట్లు ముందు జరుగవలసిన పద్ధతికై చింతినచిం నేమిలాభము.

విషు॥ ప్రియనందనా - జయమయ్యెనీకు ॥ప్రి॥ నయమొప్పనిన్ను నలచాలమద్దీ - పరజాక్షుడైనా - పరమాత్ముడేలు ॥ప్రి॥

వ॥ కుమార కనకసేన నీవుంగాక యీరాజ్యభారము వహించు వారెవ్వరు యీ జయసింహ భూపాలుని యాజ్ఞ ప్రకారము నీవిప్పుడే పట్టాభిషిక్తుండవు గమ్మి తల్లినగు నామాట వినుము తండ్రీ.

కన-వ॥ తల్లీ తమ యాజ్ఞ ప్రకారమే మెలంగువాడ.

(అని కనకసేనుని పట్టాభిషిక్తునిగాజేసి మంగళ వాయిద్యములు వాయించుట)

మంగళహారతి.

జయమంగళ మనరే - రమారమణునికి - నతజన పాలునికీ ॥ జ ॥ నయముగదీన జనాళికి నిరతము । జయమొసంగుశ్రీజగదీశ్వరునికి ॥జయ॥౧॥ వారిజ భవమ్మాడ భిడౌజ వంద్యునికి । వారిజ నాభునికీ ॥ వారణరాడ్వర దుని కచ్ఛ్యుతునికీ సారసదళలోచనునికి । శౌరికీ ॥జయ॥౨॥ నారద సనకస నందన వినుతునికీ - పన్నగ శయనునికీ - భూరిచాలమద్ది నివాసుండగు - పారావార గంభీరుని కనిశము ॥జయమంగళమనరే॥

గీ॥ వసుధ విక్రమ నామసంవత్సరమున ♦ శ్రావణాశ్రిత పక్ష పంచమి సుదినము ♦ నందు యీకనక తారను నాటకంబు ♦ రచన జేసితి హరిదయా రసముకలన॥

కనకతార నాటకము సంపూర్ణము.

---

కొండా శంకరయ్యగారి ప్రీమియర్ ముద్రాక్షరశాల, సికింద్రాబాద్.